శ్రీ

# సీతామనోహరము.

ఇది

కాశీనాధుని వీరమల్లయారాధ్యునిచే

వ్రాయఁబడి

కర్రా వేంకటరత్నముచేఁ

బ్రకటింపఁబడియె.

రెండవ కూర్పు 1000 ప్రతులు.

రామమోహన ముద్రాక్షరశాల, ఏలూరు.

1916



[వెల రు 0—8—0

# పీఠిక.

ఈప్రహసనంబునందలి కథ కేవలము కల్పితమగుటచేత నీగ్రంథముచదువరులకెట్లు రుచించునో తెలియరాకున్నది దీనిని రంగస్థలమందుఁ బ్రదర్శించుటకుఁగూడ నుపయోగించుకొనవచ్చును. ఈగ్రంథమునందలినీతి "ఆడుపిల్లలను యుక్తవయస్సు వచ్చుదనుక నాపి వారివారి మనోభీప్సితప్రకారము వరునివిచారించి పెండ్లి సేయవలయు" నని తేలుచున్నది. ఇయ్యది ప్రస్తుత ప్రపంచమునకు మిక్కిలి యుపయోగకారియే యని తలంచెదను. ఈ గ్రంథమును బెజవాడ కాపురస్థులగు సామా భావనారాయణ, ప్రెసిడెంటు, ఆ. సు. సు. కంపెని, గారి సహాయప్రోత్సాహములవలన నేను వ్రాసితిని బెజవాడ గ్రామములోని ఆర్యబాల సుజనమనోరంజనీ సమాజము వారు ప్రేమతో నీకథను నాటకముగాఁ బ్రదర్శింపనున్నారు నాసాభరణమును శృతిపుటమున దగిలించినట్లు లుండునేమోయనునది ప్రదర్శనానంతరమునఁ గాని నిర్ణయింపఁజాల. ఏదియెట్లున్నను నీతిదాయక కథాయుక్తమగుట నీగ్రంథము చదువరులచేఁ బ్రోత్సహింపఁబడునుగావుత.

ఇట్లు బుధవిధేయుడు,

కాశీనాథుని వీరమల్లయ్య,

గ్రంథకర్త.

# ఇందు వచ్చు ప్రాతలు.

———— .0: ————

## * పురుషులు *

| | |
|---|---|
| 1 సూత్రధారుడు | కథనడుపువాఁడు |
| 2 వణిక్పతి | కథానాయికతండ్రి |
| 3 సోమయ్య | వణిక్పతి కుమారుఁడు |
| 4 విదూషకుఁడు | కథానాయకుని హితుఁడు |
| 5 భుజంగరావు | కథానాయకుఁడు |
| 6 ప్రథమద్వితీయులు | భటులు |
| 7 రాజు | న్యాయాధిపతి |
| 8 డంబాచారి, ఉత్తమరావు | వకీళ్ళు |
| 9 రంగిసెట్టి | సాక్షి |

## స్త్రీలు

| | |
|---|---|
| 1 నటి | కథను నడుపునది |
| 2 కమలాంబ | కథానాయికతల్లి |
| 3 సీతారత్నము | నాయిక |
| 4 రమణి, సువదన | చెలికత్తెలు |

——(౦)——

శ్రీ

శుభమస్తు

అవిఘ్నమస్తు

# సీతామనోహరము.

ప్రథమాంకము.

నాంది

చ॥ వనధిమథించుచోఁ బొడమి పర్వతరాజకుమారికాతనూ
జుని వశమైన లచ్చిని యశోవిధిఁ జేకొనయుద్ధమాడి గె
ల్చినదనుజారి యత్తరిని లీలగ మోహిని యౌటఁగాంచి తా
వెనుకొనినట్టి శంకరుఁ డవిఘ్నముగా మిముఁబ్రోచుఁ గావుత౯ ॥

(నాంద్యంతమున నటీసూత్రధారులు ప్రవేశించుచున్నారు)

సూ— ప్రేయసీ నేడిచ్చోఁగూడిన యీసభాసదుల మనోభీష్టసూచకంబగు నాటకంబుఁ బ్రదర్శించుటకై ప్రయత్నించుచున్న నామనంబునకుడగినచరిత్రంబు తోఁచకున్నయది దీననీవు దోడ్పడవలయును

నటి— ఇంతకుమున్నె నేనొక ప్రదర్శనానుకూలంబగు గ్రంథమునుజూచితిని. అయ్యది యేతత్పురిజనమనోహ్లాదకంబని తలంచెదను.

సూ— ఏదీ ఆపొత్తమునిటు తెమ్ము (తీసికొనిచూచి) దీనినిదివఱకు నేనునుజదివియుంటిని నిక్కముగానిది ప్రస్తుతప్రదర్శనానుకూలమయినదియే.

నటి— ఆర్య దీనినెవరు రచించిరో చూడనిండు.

సూ—కవిత్వశైలినిఁబట్టి తెలిసికొనఁజాలవైతివా? తెల్పెదవినుము.

శా॥ అయ్యాతాపులకర్తమైతనరు పద్యశ్రేణిసంధించి నే
ర్పయ్యారేయనఁగాశినాథకుల దుగ్ధాంభోధిచంద్రుండు లిం
గయ్యారాధ్యసుతుండు సజ్జనగణాహ్లాదుండు నా వీరమ
ల్లయ్యాఖ్యుండురచించెఁ బ్రేక్షకులకుల్లాసంబుఁగల్పింపఁగన్॥

నటి—ఇది నాటకలక్షణానుసారముగనున్నదా?

సూ—ఇప్పటి నాటకాదుల కాపట్టింపులు లేవు. ఇఁక నాలస్యముచేయక ఋతువర్ణనము గావింపుము ప్రదర్శన మారంభింతము.

నటి — ఏఋతువునాశ్రయించి పాడవలయును?

సూ—సర్వజనామోదకరంబగు నీవసంతమునుగూర్చియే. ఇటువినుము.

చ॥ తనమదికింపుకాని పతిఁదండ్రిః ధింపఁగ నెంచు చోమనం
బునదిగులొంది పుష్పవనముఁ దరిచేరెడు కన్యకాతతిన్
గనుఁగొనిపిల్చుటోయనెడు కైవడిఁగోవెల లాప్చుచుండఁ గో
యని బదులాడుమానినుల కాశయ మొక్కవసంతకాలమే॥

నటి—నిజసుతామణులకయిష్టుఁడగు పతినివిధించు జనకులెంత మూఢచిత్తులు!

(తెరలో) ఎవరాయాక్షేపించుచున్నవారు?

సూ—చెలీ! తననెత్తిపొడుపుగా మాటలాడితిమని చీదరించుకొనుచు వణిక్పతి వచ్చుచున్నాఁడు. మనముపోవుదమురమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సీతామనోహరము.

## ప్రథమాంకము.

(వణిక్పతియను నొకవృద్ధుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వణి—ఆ! ఎవరు నన్నాక్షేపించునది. అవును ఆక్షేపించ కేమి జగమును మూయుటకు మూకుఁడుండునా? లేకలేక యీవృద్ధాప్యమునఁగలిగిన నాసంతానములో నొకరికేనియుఁ గార్యకరములఁ జేయనైతి. అందులో నాప్రథమకుమార్తెకు,

ఉ॥ పెండిలియీడువచ్చినను పెండిలిసేయకయుంటి, రేపటె
ల్లుండివయోభవంబున లోకము నింద్యము సేతురింటిలోఁ
గొండొకకారణంబునను గూఁతురుదల్లియు నిష్ప్రసిద్ధమై
యుండిన యట్టిమేనరిక మొల్లరు కార్యమదెట్లుసాగునో॥

నాతోఁబుట్టువు తనకుమారునకు నాబిడ్డనిచ్చి వివాహముసేయుమనియు లేకున్న మనసంబంధమింతటితో నంతరించిపోవుననియుఁ బలుమారులు నాతోఁజెప్పుకొని కంటఁదడిపెట్టుకొనుటనుజూచి వారిపేదరికమును గుఱ్ఱవాని విరూపసౌంద్యగుణములును విచారింపకయే నేనంగీకరింతునని మాయాఁడువారు నన్ను మందలింపఁ బ్రయత్నించుచుండిరి.

తే॥ గీ॥ తెలివిగలయట్టివాఁడైన తెల్విహీనుఁ
డయిన మేనల్లునకొసంగు న్యాయమొకటి
మొదటినుండియు కులమందు ముఖ్యమయ్యె
దానినేడెట్లుతప్పింతు ధనముకొఱకు॥

పోనిమ్ము. ఎటులయిన స్వతంత్రించి చేయుదమన్నను,

తే॥ గీ॥ ఆఁడువారలమాటల నవలఁబెట్టి
పనులు నెరవేర్చుశక్తి మావర్ణమునకు
సాగనేరదు కాని యీసమయమందు
నాకు తప్పకవచ్చె కన్యకనుగూర్చి॥

ఏమి సేయుటకును దరియుతెన్నును తోఁచకున్నయది. ఇచ్చిననింటిలోనిపోరు ఘనమగును. ఈకున్న మత్సహోదరి కంటనీరు బెట్టుకొనును ఉపరి పరమార్థహానియు సంభవించును

ఉ॥ ఇనను బిల్చి నాసుదతికంతయు జెప్పి మనంబు ద్రిప్పి సం
ధానము సేయఁగావలయు దైవముకూడ ననుగ్రహించి నా
చానను దానొడంబఱచి సర్వవిధంబుల మేనయల్లుఁడే
దీనిని బెండ్లియాడుటకు దివ్యముహూర్తముగూర్పమేలగున్.

(తిరిగి చూచి) అదిగో! అనుకొనినప్పటికే నాభార్యమాడనిటు వచ్చుచున్నది. కొంచెము నెమ్మదిఁగా జెప్పినచో వినకమానునా? మేనల్లునకు పిల్లనిచ్చువారికి పుణ్యలోకగతులు గలుగునందురు భూమియందుఁ బుట్టినవిమ్మట పుణ్యలోకగతులకుఁ బ్రయత్నింపనివారుందురా? కావునఁ దప్పకయొప్పుకొనునని తోఁచెడిని.

(వణిక్పతిభార్యయగు కమలాంబ ప్రవేశించుచున్నది)

కమ —(ప్రవేశించి తనలో) నా మోహనాంగుని ముఖారవిందము దీర్ఘాలోచనభావమును బొడసూపుచున్నది. దేనినిఁగూర్చియై యుండునో. ఏముండఁగలదు. కుత్తు దానివివాహమునుగూర్చియే చింతించుచుండబోలు అయినను గనుఁగొందము (సమీపించి ప్రకాశముగా) నాథా! మీరేదియో గాఢాలోచన సేయుచున్నట్లు ముఖభావము తెల్పుచున్నది. నేను వినఁదగియుంటినేని సెలవిండు.

వణి — (తనలో) అడిగినప్పుడే చెప్పినచో నంగీకరించునేమో! (ప్రకాశముగా) ఏమియును లేదు నీకుఁ దెలియనిదేమున్నది.

కమ — విస్పష్టముగాఁ జెప్పనిదే తెలిసికొనఁజాలునంత తెలివినాకు లేద
ని మీరు మాత్రమెఱుఁగరా?

వణి — నీచమత్కారవచనములకేమి లే. అయినను దెల్పెదను వినుము.

మ॥ చెలియా! పుత్రికిఁ బెండ్లి యీడగుట నీచేతం బెఱుంగుఁగదా
యలివేణి! మన మేనయల్లునకు నీయఁ సౌఖ్యముఁ జెందు స
ల్లలితుండాతఁడు వానికిచ్చినను నుల్లంబారఁగా సౌఖ్యముల్
తలిదండ్రుల్గని పుణ్యలోకమున నిత్యశ్రేయముల్గాంచెడిఁ.

కమ — (తనలో) ఈయనగారికి మొదటినుండియు నీవివాహవిషయా
లోచనమే. శరీరదౌర్బల్యము కూడ సంభవింపజేసినది పోసిమ్ము.
మేనల్లునకిచ్చుట కంగీకరింతమన్న వారిస్థితిగతులు కన్నులారఁజూచు
చు నిష్కారణము పిల్లగొంతుకోయుటకు నామనమియ్యకొనకుండె
ఈసంగతి చెప్పిన నిప్పటియీయన మనోవ్యథమఱింత వృద్ధికాఁగ
లదు ఏమేనియగుఁగాకఁ (ప్రకాశముగా) మనోనాయకా! మీ
రు చెప్పినమాట వాస్తవమే ఏదేనిఁదగు సంబంధము చూచుకొని
శీఘ్రముగా వివాహము సేయుట యత్యావశ్యకము. జాగు చేసిన
సాటివారిలోఁ దలవంపులు ఘటిల్లును.

వణి — (తనలో) మేనరికమిచ్చుట కిష్టము లేదనుమాటమిక్కిలి గంభీర
ముగా వెలఁబుచ్చినదే! వాగ్గుంభనకు స్త్రీజనములే ప్రథమగణ్యా
లు (ప్రకాశముగా) తగినసంబంధము కుదిరియేయున్నదికదా!

కమ — ఏదీ?

వణి — మేనరికము.

కమ — మేనరికమా? తగినసంబంధమే ఇదియొకటియేనా? యింకేదై
న నాలోచించియుంటిరా?

వణి — నాయభిప్రాయము గట్టిగా వానికీవలయుననియే.

తే॥ గీ॥ నీయభిప్రాయమును జెప్పు నీరజాక్షి
జాగు సేయుటమనకుఁ గర్జంబు కాదు

అనతికాలంబుననె వివాహంబుసేయ
వలయు నీడువచ్చినపిల్ల నిలుపఁదగదు॥

కమ— వారిదరిద్రదేవత మనయమ్మాయినెత్తినఁగూడఁ దాండవమా
డుచుఁ గూటికిగుడ్డకు మొగమువాయు నట్లొనరింపవలయునని
యీ మీయభిప్రాయము. బాగుగనేయున్నది.

వణి— ఆ! నీమాటలకేమిలే,

— తే॥ గీ॥ ద్రవ్యమునకేమి మనకున్న దానిలోనె
వారుకూడనుదినుచుంద్రు వలయునేని.
దోడబుట్టిన దానిని దుఃఖపెట్టి
పరులకిచ్చిన ఫలమేమి పంకజాక్షి.

కమ—తోడబుట్టినదాని దుఃఖము తీర్చుటకుఁ గడుపునఁ బుట్టినదాని
ని వంతఁగుడిపెదరా యేమి? ముందాలోచనలేక మీతండ్రిగారు
మీతోఁబుట్టువును బేదలకిచ్చుటచేతనేకదా యాపె విచారమును
మీరు తీర్చుటకుఁ బ్రయత్నించుట సంభవించినది. మీరనునట్టిపని
యేకావించి ముక్కుపచ్చలారని మన చిన్నికుమారునకు నిట్టికష్ట
ములే కల్పించెదరు కాఁబోలు ఇది నాకిష్టము లేదు మఱియొక సం
బంధము చూడుఁడు.

వణి—బాగుగాఁజెప్పితివి దానిభారము మనమేమి మోయుచున్నాము?
దానికొమరుఁడు మాత్రము మన పిల్లలయట్టివాఁడు కాఁడా? వాని
కార్యకరముల విషయమై మనమాలోచించుట తప్పిదమా?

కమ—తప్పితమే అన్నవస్త్రములకు లేక యల్లాడువాని మెడకొక గు
దియబండ గట్టినట్లు భార్యాపోష్యమునుగూడ నొప్పగించుట యు
చితమా.

వణి—నీయుక్తి నాకంత సమంజసముగాఁ గనుపట్టుట లేదు భార్యనుబో
షించుకొనఁజాలని యంతయసమర్థులుందురా? ఏమైనను సరే యీ
చిన్నదానిని వానికేయిచ్చి పెండ్లిచేసెదను.

కమ—అట్లుసేయుటవలని నష్టము నాకొకటియుఁ మీకొకటియు గాఁ

డు. ఉభయులకును సమానమే యీ సంబంధమును జేసికొనుట యందు మనపిల్లదానికిఁగూడ బొత్తుగా నిష్టములేదు. అననుకూల దాంపత్యమువలన ముప్పున ప్రతిష్టయుగూడ సంప్రాప్తము కాగ లదు. ఈడువచ్చినపిల్ల కయిష్టుడగు వరునినంటగట్టుటయుచితంబు కాదు. పిల్లదానినిఁ బిలిచిమీరును గనుఁగొనుఁడు. ఈచుట్టరికము కూడదని మనసోముఁడుకూడ పలుమారులు ముచ్చటించి యున్నాఁడు.

వణి—నీమాటలునాకుఁ గడునాశ్చర్యమును బుట్టించుచున్నవి.

తే॥ గీ॥ లోకమందుననెవరేని నీకునిష్ట
మాయటంచును బిల్లలనడిగి పెండ్లి
సేయువిధమునగంటిమే చెలులగలిత
లరయనేర్తురె నిజమనోహరులనెపుడు॥

కమ—ఇంటిలోఁ దల్లిపిల్లల కెవరికిని నిష్టము లేనపుడు పరమస్వతంత్రులముగ దాయని మీయిచ్చవచ్చినట్లు గొంతును గోయనెంచుట మీకుమాత్రము మహాగౌరవము గాఁబోలును! కడుపునఁ బుట్టిన పిల్లల సేమమారయనివారు లోకములో మీరుతప్ప యింకెవరును గానఁబడరు.

వణి—(తనలో) ఈమెకు నిజముగా కోపమువచ్చినట్లున్నది. పాపము! యీపె చెప్పెడిమాటలన్నియు సహేతుకములుగా నున్నను పరమార్థాని సంభవించునేమోయను భయముచేతను జెలియలిపై ప్రేమచేతను నామనసున జొరకున్నయవి కావున సామవచనంబులచేతనే ఈచాననొప్పించి కార్యముసానుకూలపరచెద (ప్రకాశముగా) ఓకాంతామణీ! నీవును దెలియని మూఢురాలివలెఁ గోపించెదవేల? ఇటువినుము,

చ॥ ఘనతరపాపహేతుకము గాదిలియల్లునకీయకుండ నే
ధనికునకో యొసంగుటది తద్దయునక్రమ కార్యమందునుᳫ
వనరుహపత్రనేత్ర పెకవారలకిచ్చిన నేమిలాభ మ
ల్లునకునొసంగుటేజగతిలో ఘనకార్యము మానినీమణీ॥

కావున,

తే॥ గీ॥ కుఱ్ఱవానినిఁగూడను గొంత యడిగి
కార్యనిశ్చయమును సేయఁ గడఁగవలయు
నెన్ని కార్యమ్ములున్నను సన్నుతాంగి
వానిబిలిపింపుమిపుడు సత్వరముగాను॥

కమ— ఈగోడవనాకేల? నేను బోయి పిల్లవానినిఁబంపెదను. మీరిరువురు నాలోచించి కార్యనిశ్చయము జేసికొనుఁడు.

వణి—మంచిది నీవట్లుసేయుము

కమ—(నిష్క్రమించుచున్నది)

వణి— ఈ బాంధవ్యమునుగూర్చి వీరికింత పట్టుదలతగునా? పేదలైనను కదా వీరుసెప్పెడి యభ్యంతరము కలిమిలేములు కాపురము సేయునా? బందులోడలునుగావచ్చు నోడలుబండ్లునుగావచ్చును ఇదికాక కురీపియందురేమో, యాసంశయమును దీర్చుటకు వాఁడౌషధము సేవించుచునేయున్నాఁడు కదా! అయిననుగుఱ్ఱవాఁడేమి సెప్పునో కనుఁగొందము (తిరిగిచూచి) అదుగోవచ్చుచున్నాఁడు.

(సోముఁడు ప్రవేశించుచున్నాఁడు)

సోము—(ప్రవేశించి) తండ్రీనమస్కారము నన్నేటికిఁబిలిపించితిరి?

వణి— నాయనారమ్ము కూరుచుండుము నీతోనొక్కవిషయంబున నాలోచించుటకునై పిలిచితిని సావధానముగా వినుము.

సోము-(తనలో) మాతల్లిగారు నాతోనంతయుఁ జెప్పియేపంపినదికదా ఆవిషయము చే మరలముచ్చటించును యీసందర్భములో నమ్మగారి యభిప్రాయమే సమంజసముగానున్నది. అయినను దండ్రిగారేమి చెప్పుదురోగనుగొందము (ప్రకాశముగా) జనకా సెలవిండు.

వణి—(తనలో) వీనికింతయుఁ దల్లినూరిపోసియే యుండును అయినను జెప్పిచూతము (ప్రకాశముగా)

మ॥ తనయా నీమనపహోదరీమణిని సీతారత్నముఁ బావరా
మునకున్వేడ్క నొసంగి పెండ్లిసలుపన్ మోదంబుగన్లెన్నదిన్

మనమారీతిని సంప్రతించుటకు మామాఁ తన్నినుఁ బిల్చితిఁ
జనుమార్గణంబును నిశ్చయింపుము కులాచారంబు పోకుండఁగఁ॥

సోము—(తనలో) విన్నదానికంటె నధికమగు సంగతు లేవియును లేవు. ఈయనకు మేనల్లునకే యీవలెనన్న పట్టుదలయేల కలిగినదో తోఁచకున్నది ఇట్లని చూచెదను (ప్రకాశముగా)

తే॥ గీ॥ తండ్రినియమించు విధినన్యథాకరింపఁ
దప్పటంచును దెలిసియుఁ జెప్పుచుంటి
నీడువచ్చినపిల్లల యిష్టవిధిని
జరుపఁబూనుట కర్జంబు జనకమనకు॥

వణి—(తనలో) అహా అనుకొనినంతయు జరిగినది తనయిష్టమునంతయు వీనికిఁగూడ నూరిపోసియేపంపినది యించుకకోపగించి చూచెదను. ప్రకాశముగా)

తే॥ గీ॥ ఓరిమూర్ఖుఁడమితిమీరి నోరికెట్లు
వచ్చునట్లాడుచుంటివా భయమువిడిచి
సంప్రతింపుగ నడిగినఁజలముమిగిలి
యడ్డదిడ్డంబులాడెదవా ఖలుండ॥

సోము—(తనలో) అయ్యో నా జనకుఁడు నన్నునిష్కారణముగఁగోపగింపఁబూనినాఁడే యీయనగారిపద్ధతి నాకుఁదెలిసినప్పటి నుండియు నింతే తాఁబట్టినకుందేటికి మూడేకాళ్ళనుటయే కాని యాలోచనయెంతమాత్రమును లేదు. (ప్రకాశముగా)

తే॥ గీ॥ కోపగింపకుమయ్యనేఁ గుఱ్ఱదాని
నడిగివచియింతునింకొక్క యామమునకు
జనకయాలోనవేఱొక్క పనినిఁజూచు
కొనుడుతొందర పడఁగార్యమునకుమేలె॥

వణి—(కోపముతో) కుఱ్ఱవానినడిగిన విమ్మటఁ జెప్పెదవా నీయిష్టమును నీవారి యిష్టమును లేనిచో నేనీకార్యమును సేయఁజాలనేమి? పిలిచి యడిగితినికదాయని విఱ్ఱవీగుచున్నారు కాఁబోలును కానిం

ము. మీర లెట్లడ్డగలరో చూచెదను గాక.

సోము-(తనలో) అయ్యో యీయనకీ దురాగ్రహ మేలో కో ముందు వెను కల నించుకయు నాలోచింపకున్నాడే యిట్లగు గాక (ప్రకాశముగా) తండ్రీమీ ప్రయత్నమును గాదనఁజాలువా రెవరు? కొండ్లయైనపిమ్మట యావజ్జీవమును మగనిదాస్యములో నుండవలసినదికనుక నాసహోదరి యభిమతమును గూడఁ దెలిసికొని వచియింతునంటిని యిందేమి తప్పిదమున్నది.

వణి—తప్పిద మేమియును లేదు లెమ్ము.

క॥ ఏమైనను మేనల్లున
కీమగువనునీయ నిశ్చయించితిమీరల్
భామామణి యొప్పునటుల్
సామంబునఁ జెప్పిరందు చయ్యనసిటకున్॥

సోము-మీరునిశ్చయించిన పిమ్మట నేనడిగి చెప్పవలసిన దేముండును. చెప్పినదానిని సరియయిన యాలోచనలోఁబెట్టినప్పుడు నేనేమి సేయగలను. అననుకూల దాంపత్యము కులమును జెడఁగొట్టుననుట మీరెఱుంగనిదికాదు. తక్కినకులములమాట యెట్లున్నను మనకులపువనితలలో నేకారణముచేత నేమి చెడునడవడికలవారరుదుఅట్టియెడ,

క॥ అరసియు నరయకయీగతి
జెఱుతఁపుఁ బంతిమునకూని సెట్టికొలమ్ముల్
జెఱుపఁదలంచుట తగవే
గతితలసాహసముచేటు కల్పింపదొక్కో॥

వణి—నీమాత్రము నాకాలోచన లేకపోలేదు తెలిసియుఁ దెలియని నీప్రసంగమును విస్తరింపకుము నేను గార్యాంతరమునకుఁ బోయి వచ్చునప్పటికి యంతయును సిద్ధముచేసి యుంచుము. రేపటియష్టమీ బుధవారమునాడు మంచిసుముహూర్తము కలదని మనపురోహితుఁడు నాతోఁ జెప్పియున్నాఁడు విచారించి వచ్చెదను.
(నిష్క్రమించుచున్నాఁడు)

సోము — అకటా పూర్వకాలపు హిందూమతోద్ధారకులు బాల్యవివాహములను వధూవరుల యిర్వురి యిష్టమును విచారించక తలిదండ్రుల యిష్టానుసారము గావించు వివాహములుఁజే జేయవచ్చునని నియమించుట ప్రస్తుతకాలమునకు మిక్కిలి విపరీతమయి పరిణమించినది. అట్లుజరుపుచుండుట చేతనేకదా,

చ॥ సరసిజనేత్రులందు వ్యభిచారము హెచ్చె తటస్థమైనచో
పరులను గాసిపెట్టె బలవన్మరణంబులఁ గాంచగల్గు ని
ర్వరకు నయిష్టమైనపుడు భూమినివింతలు పుట్టుటన్న న
చ్చెరువగు నేగ్రహింపకిటు శీలముబాపుట యుక్తమౌనొకో॥

అయినను జిన్నవాఁడనగు నేనేమిసేయఁగలను నిష్కారణముగా నాతండ్రిగారు నన్నునాదరముచేసి యుండిరి. ఇప్పటికయినను పెద్దలందరు నొక్కమాట ననుకొని ప్రస్తుతప్రపంచస్థితికిఁ దగినట్లు వివాహములు గావించినచో నెంతబాగుగానుండును (తిరిగిచూచి) అదిగో మాయమ్మయు నాసహోదరియు నిటువచ్చుచున్నారు. ఏమాలోచించుకొనిరో తెలిసికొనియెదను.

(కమలాంబయు నామెకూతురు సీతారత్నమును ప్రవేశించుచున్నారు.)

సోము--అమ్మా నాన్నగారు కొండొకకార్యమునకయి యవలకుఁబోయినారు తానుతిరిగివచ్చునప్పటికి మనమువ్వురము నాలోచించి ఆయన యిష్టానుసారముగా జరుపుటకు సిద్ధముగానుండవలయునట అమ్మాయితో నిదియంతయుఁ జెప్పితివా?

కమ--ఆ! నేను చెప్పడమయినది. నీవుకూడ చెప్పి లేదనిపించుకొనుము.

సోము—(తనలో) జనకునాజ్ఞ నిర్వహించక తప్పదుగదా నావిధిప్రకారము నేను చెప్పిచూచెదను. (ప్రకాశముగా)

కమాచిరాగము-ఆటతాళము.

(బాలరావేమట్టు)

చాననిన్ను మేనబావకు సలలితంబుగ పెండ్లిసేయఁగ।
జనకుమనమున నిశ్చయించెను సమ్మతింతువె చెలియలా॥ చాన

సీత — అన్న నన్ను ఖిన్న జేయుగఁగన్న తండ్రికి గలిగెఁగా।
ఇన్ని యేటికినన్నతని కీయున్న నుడిసెద విన్నవింపుము॥ అన్న
సోము — ఎవరు సెప్పిన చెవినిఁబెట్టడు యువతినీదగుకర్మవశమున
నవసరంబుగ నెవియుఁజూడక కువలయాక్షి రోకోప మొందుచు
సీత — ముందు వెనుకలజూడనెంచక ముందుఁడైన వానికినొసంగిన।
నెంచునో యేవేళనో నాయిందుశేఖరలోక మేగెద॥ అన్న
సోము — జనకునానతిమీరఁబోకు నువనితదుగఁ గతిగల్గెదుగ।
జనన మొందగఁ జేయువేళను వనజనేత్రుడు వ్రాయు రీతిని॥ చాన
సీత — విధివశంబునఁ బృధివిలోబడి యధమవిధమును గూర్చిచింతిల।
వృధయకాకెటు మనలకుమనోరధముతీరును సోదరా॥ అన్న
సోము — (తనలో) అకటా! ఈమెమనోనిశ్చయము కడు లెస్సగానున్నదే!
నాతండ్రిగారికిని నాచెలియలికినిఁగల పరస్పర భేదాభిప్రాయములను
బట్టిచూడ దురంతమగునొకయల్లరి పుట్టునని తోఁచుచున్నది. నాశక్తి
కొలఁదిని ప్రయత్నించి యీమెయొక్క యభిప్రాయమునుఁ మార్చ
జూచెదను (ప్రకాశముగా) అమ్మాయి (జతిమూలుటనభినయించుచు)
తే॥గీ॥ ఆడువారికిస్వాతంత్ర్యమన్న మాట
సున్నయనినీ వెరుంగవే చిన్ని చెల్లి
తండ్రిమాటను మీరుట తగవుకాదు
చదువుకొన్నట్టినీ బోటి సుదతి కెపుడు॥
సీతా — అన్నా! నీవుకూడ నిష్కారణముగా నన్ను కోపగింపనెంచితివా?
చ॥ వనితకుఁబుట్టువాదిపదివత్సరములపయి మీరుదాఁక త
జ్జననికిఁదండ్రికిన్వడఁకుచందముపై మృతినొందుదాఁక భ
ర్తనుమఱిపుత్రులఁ గనినఁదద్దయుభీతిలుచుండుచందముఁ
వనజభవుండువ్రాయుటది పాక్షికవృత్తియు కాకన్యాయమే॥
కన్నతలిదండ్రులుగాని చేసికొనినభర్తగాని కడుపునపుట్టినబిడ్డ
లుగాని యాఁడుదానికేడుగడగానుండి వారికనుకూలమగు విషయము
లనన్నిటినిచారించి నెఱప్పవేరనియేకదా స్త్రీలకస్వాతంత్ర్యమును నియ

మించినది. తద్భిన్నాచరణులై జననీజనక భర్తృపుత్రాదులకు కాంతాజనములు మాత్రమేలలోఁబడవలయును ?

సోము — అమ్మాయి ! తండ్రిగారుమాత్రము నీకేమియుపకారము చేయుచున్నారు ? నిష్కారణముగ నేలతిరస్కరించెదవు.

సీతా — అన్నా ? ఇంకేమి చేయవలయును. ఇట్టి ప్రయత్నములు చేతనే కదా లోకములోని స్త్రీసంఘములో ననేకులకు దుర్వారమగు దుర్గతులు సంభవించుచున్నవి.

సోము — ఎందువలన ?

సీతా — ఎందువల్లననియా ? ఇటువినుము.

తే॥ గీ॥ మగువకిష్టంబు లేనట్టి మగనిఁదెచ్చి
పెండ్లిసేయుటచేతనే బిసరుహాక్షు
లందుఁ బెక్కురుగుణహీనలగుచు వ్యభిచ
రించి శీలంబు పాడొనరింతు రందు॥

శా॥ ఈడుంగ జోడయి యొండొరుల్ వలచి స్నేహేచ్ఛఁ వివాహంబునైఁ
గూడుంగ గుడ్డకు లోపముండక మహోత్సవంబుగా దంపతుల్
క్రీడల్ సల్పుచు గాఢమౌ వలపునన్ రేలుంబవల్ బుచ్చుచో
బాడుంబుద్ధులు పుట్టునే పడతు లవ్యక్తంబుగానుందురే॥

ఆఁడుపిల్లలబాధ్యత వహించినప్పుడు జననీజనకు లివియన్నియు స్వయముగా నాలోచించుచుటే విధ్యుక్తము కానిచో వారినిర్ణయము లు పుత్రికలచే నెట్లంగీకరింపఁబడును.

క్షమ — నాముద్దుపట్టీ ! నీమురిపెమును జెల్లించుటకేగదా నీతండ్రిగారీ ప్రయత్నమునకుఁ బూనియున్నది. నీమంచిచెడుగుల నాయనమాత్రము విచారింపకుందురా.

సీతా — (తనలో) తండ్రిగారొనర్పఁబూనినది తనకయిష్టమైనను భర్తృతిరస్కారమునకు వెరచి పైకూరకిట్లనుచున్నది. (ప్రకాశముగా.)

శా॥ అమ్మా మీసుతవిన్నపంబొకటి న్యాయంబైన సద్బుద్ధిఁజే
కొమ్మా సుందరవిగ్రహుండగుచు నాకుం జోడునౌ వానికీ

విమ్మా మేనరికంబటంచు మనసు ద్వేటం బడఁ ద్రోయమో
దమ్మా నాకు సుఖోదయమ్మునకుఁ గాదా పెండ్లిగావించుటల్॥

తే॥ గీ॥ అమ్మ నవమాసములు మోసి నట్టినీవు
దయను విడనాడినావె నాతండ్రివలెనె
మీకు నిర్వ్యరకును గాని నాకుభూమి
పైన మనియున్న నొక్కింత ఫలముగలదె॥

క॥ ఆజన్మాంతము పతి కే
యోజఁదగు సేవసేతు నొల్లమికతనన్
నాజన్మంబిటు దుఃఖపుఁ
భాజనముగ సేయమీకుఁ బాపముగాదె॥

(బేహాగ్ రాగము—ఏకతాళము.)

(భూపతెమూపరితాపముదీరిచి మట్టు)

సోమ—సోదరినీదగు వాదములనువిడి। సాదరమునసమ్మోదముగనుమా
కాదననికేదయిరా। రాఁదగులాభము కనఁబడఁజాలదు॥ సో॥

సీతా—ఏటికిబూటకె మీగతిచేసెదు। తేటతెల్లముగఁ దెలిసియుమో
మోటమునన్। మాటవినన్। జేటగుసోదర చెప్పకుమీయెడ॥ సే॥

సో—ఈయెడనాయన చేయుటమానడు। చేయునుపాయము చెల్లదుసుమ్మి
దాయలలో హేయముగాదా! యోచెల్లెలతప్పకవినుమా॥

సీ—అనయమువసితలకనపాయమ్మగు। పసిబూనుట యేఘనముగఁ గాకెట్లు
తనదగువర్తనమునుమా। ననిచోఁగాఁదగుపని మాచెదపై॥

వణి—(ప్రవేశించి తనలో) ఓహో మాసీతారత్నముమాటలు బహు కఠినముగానున్నవే. ఆపెకీసంబంధము బొత్తుగా నిష్టములేదనుటయే నిక్కముగాఁ గనఁబడుచున్నది. అయినను స్వయముగా నేను బోయి నాలుగు వేలరూకలు నగల క్రింద నిచ్చునటుల తేర్పఱచి మాట యిచ్చివచ్చితినిగదా! తప్పుటెట్లు? వీరిసంభాషణ విననట్లే నటించి కర్తవ్యమును దెల్పెద. (ప్రకాశముగా) కుమారా! సంబంధ

ము నిశ్చయించుకొనవచ్చితిని. కట్టుబొట్టులన్నియు మన కనుకూల
ముగానే కుదిరినవి.

చ॥ అనువుగ జేసివచ్చితి సహస్రచతుష్టయ రూప్యములన్ నగల్
మనకొకచీరలైదు మరియుంగళహారతి పళ్ళెరంబునం
దున శతరూప్యముల్ పయిచతుర్దశగున్ముల నడవళ్ళు క్రిందమా
కెనిమిదివందలేర్పఱచి యీ బహుళాష్టమి లగ్నముంచితిన్॥

తే॥ గీ॥ మనప్రయత్నంబులన్నియు మనము చేసి
కొనుట యావశ్యకంబయ్యె కోమిరిం బెండ్లి
కూతుజేయింపు మెల్లుండి గుమితగముగ
నలరి తరలివచ్చెదరు వియ్యాలవారు॥

కావున నీవు తత్క్షణంబ ముదాళియమునకేగి శుభపత్రికల నచ్చొ
త్తించి బంధువులందఱికిం బంపి యాహ్వానముపంపుము.

సో—తండ్రీ చిత్తము సెలవు గైకొనెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

వణి—కాంతామణీ! నీవు కడుజాగరూకురాలవై పనిబాగులవారిచే ప్రయత్నమంతయు సిద్ధము సేయింపుము. కార్యనిర్వాహకమంతయు నీవలననే కాఁదగినది ప్రతిష్ఠాప్రతిష్ఠలు మననెత్తిపైబడును. నీవిక తడయక పొమ్ము.

కమ—నాథా! మీయభీష్టమున కన్యథాకరింపువా రెవరు. (నిష్క్రమించును.)

సీతా—(తనలో) నాయభిప్రాయము జనకునిచెవినిగూడ బడవైచి యుంచుట యుక్తమనితోచెడిని (ప్రకాశముగా.)

తోడిరాగము ఏకతాళము.

(మేరకాదు నామనవినివినుమ మట్టు.)

మేనరిక మీకొనకుముజనకా
మనోంబుజమ్మున బూనకకినుక॥ మేన॥
నా మనంబునందువలవని పూరుషునకు
నన్నొసంగుటన్న మీకు గన్నతండ్రిలక్షణంబ॥ మేన॥

వణి—(తనలో) ఓహో! ఈమె తనయభిమతంబును నాకుకూడ దెలుప సాహసించినదే. ఇందున కెడమీయకూడదు. (ప్రకాశముగా) ఛీ నిర్భాగ్యురాలా సిగ్గునువిడనాడి నాతోఁగూడ నడ్డదిడ్డముల జెప్పుచుంటివా చాలునిక నోరుమూయుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

సీతా—అకటా! కన్నతండ్రిఁగదాయని నాయభిమతమును జెప్పికొనబో వసహజమునకుమించిన కాఠిన్యమునువహించి నాజనకుండు చీదరించుకొనుచు నావలకుఁబోయె ఇకనా మొరాలకించువారెవరు భూమియందున సృష్టించునవుడా స్రష్టనానొసటనెట్లువ్రాసెనో యట్లుజరుగును నేను చింతించినఫలమేమి నాయిష్టదైవంబగు శంకరునిగూర్చి ఇంచుక ప్రార్థించుకొనెదను.

(తోడిరాగము ఏకతాళము.)

(శంకరాభ్రోఎరామట్లు.)

ఈశ్వరా కావరా।
నామనోరథంబుదీర్ప రారా వేగ ॥నీశ్వ॥
అనయంబునిన్నునే మనమందు నెంచెద।
ఘనముగబ్రోవర కామాంతకా వేగ ॥నీశ్వ॥
నన్నునొక్క మూర్ఖునిమెడ గట్టజూచెడు।
జనకుసెమ్మనంబు మరలింపరా వేగ ॥నీశ్వ॥

ఇతి శ్రీమత్కాశినాథుని వీరమల్లయారాధ్య
విరచిత సీతామనోహరనాట
కంబున ప్రథమాంకము.

శుభమస్తు.
అవిఘ్నమస్తు.

# సీతామనోహరము:

## ద్వితీయాంకము.

(విష్కంభము.)

(రమణి, సువదనలను నిద్దరు చెలికత్తెలు ప్రవేశించుచున్నారు)

రమ — సఖీ; మనసీతారత్నము పెండ్లిచేసికొనననీ బిఱ్ఱబిగిసి చివరకు మేన బావగారినే కట్టుకొన్నదే మొదటనే బెట్టుసేయకయున్నచో గౌరవముగా నుండెడిదీనుమా !

సువ - ఆమె కిప్పుడుగాత్రము గౌరవహాని యేమి సంభవించినది ? ఆమె పట్టుదలకేమియు భంగము కలుగనే లేదు.

రమ— భంగముకలుగలేదా : బాగాయె నీపలుకులు మిక్కిలి వింతగానున్నవే. పెండ్లికిని మొన్న గర్భాధానమునకునుగూడ పేరంటము జేసిన నీకు మఱితప్పుచున్నదా యేమి ?

సువ—పెండ్లియైనంతమాత్రముననే యాకురూపి పెనిమిటియైనాడను కొంటివా యేమి?

రమ —ఏలకాఁడు? ఎట్లువాఁడగును?

సువ—సీతారత్నమతనిని మనస్సాక్షిగా వరింపకుండుటచే నతఁడు భర్త కాఁడు కన్యా పురుషులిరువురును పరస్పరానురాగము కలవారయి యుండొరుల వరించునపుడు భార్యాభర్తలగుదురు స్వయంవరముకానిచొ యితరులు బలాత్కారముగ వేడుకలుగావించుకొన్నంతమాత్రమున నది పెండ్లియగునా ? అట్టిస్త్రీపురుషులు దంపతులగుదురా.

రమ—దంపతులేకానిచో సీతారత్నము గర్భాదాన వైభవమున కెట్లొడబడినది ?

సువ — అదియును బూటకమే అతఁడు కల్పితభర్తయగు సీతాపతికిఁ బరాభవముతప్ప మఱేమియుఁ గాలేదు.

రమ — చెలీ ! యీచరిత్రము కడునద్భుతముగా నున్నది సుమీ ! ఎటువంటి పరాభవము జరిగినది ?

సువ — ఆభిషేకముహూర్తమునాఁడు తల్లి మొదలగు స్త్రీజనముల ప్రేరణముచేఁ గొందఱు స్త్రీలు పట్టి బలవంతముగా సీతారత్నముఁ గదిలోనికిఁ ద్రోయఁబడిన పిమ్మటఁ గవాటమును మఱియొక కాంతారత్నము బంధించినది.

రమ — తరువాత నేమిజరిగినది ?

సువ — మన చెలికత్తె లోపలికిఁబోయి నిజమనోహర సంయోగావాప్తి కొఱకయి పూనికతోఁ బరమేశ్వరునిఁగూర్చి ధ్యానించుచు యోగముద్రధరించి యొకమూల గూర్చుండెను. అప్పుడా నిరర్థక పురుషుఁడు సీతారత్నముయొక్క యసమాన యోగినీవేషమును గాంచి మనంబున నచ్చెరువొంది సాగిలి పాదాక్రాంతుడై యంతటి నుండియు నామె ప్రశంసయే తలపెట్టక కొంతకాకగదిలోఁ దనగుట్టు బయల్పడకుండునటుల నిద్రించుచుఁ గాలము గడుపుచున్నాఁడట.

రమ — ఇదంతయు నీకెవరుచెప్పిరి ? యీ యుదంతమంతయును నమ్ముటకు శక్యము గాకున్నదే !

సువ — నీయట్టి మూర్ఖురాండ్ర కిటులనే కనఁబడుచుండును లెమ్ము. ఇదినాతో మన సీతారత్నమే రహస్యముగాఁ జెప్పినది. మరల నెవ్వరితో ననకుసుమీ ?

రమ — లేదు నీతోడు. నిజముగాఁ జెప్పను కాని నిజమనోహరసంయోగావ్యాప్తికొఱకంటివే యా నిజమనోహరుఁడెవఁడు?

సువ — అతఁడు మనభుజంగరావే.

రమ — అటులనా ? వారిరువురికి నీడును జోడును జక్కఁగా సరిపోయినది. కాని వారికి సంయోగ మెట్లుసంభవింపగలదు.

సువ — దానికిఁదగు నేర్పాటు గావించి యిటు వచ్చుచున్నాను. బ

హుస్వల్పకాలముననే యాతఁడు రాఁగలఁడు. వీరికిఁ బురుషునకును గూ
టమి సంభవింపఁగలదు. నీవే చూతువు లెమ్ము.

రమ—వీరి రహస్యసంయోగము బయల్పడినచో లోకులీ యిరువురిపై
వ్యభిచారదోష మారోపింపరా?

సువ—ఆరోపింతురుగాక ప్రాపంచక మాయాచిత్తులైన లోకులేమను
కొన్న నేమిలాభము పరలోకదూష్యము కాదుకదా.

రమ—లోకులమాట నటుంచుము ఈపెయొక్క జననీజనకులు మా
త్రము దీనికి హర్షించి యూరకుందురా?

సువ—ఊరకొనకున్న నీపాపమంతయు వారిపాలే యగును బలా
త్కారముగా నొకరి కంటఁగట్టుటకు వీరికధికారముకలదా?

రమ—అట్లైన నీవిప్పుడెచ్చటికిఁ బోయెదవు?

సువ—ఈసమీపముననే యుద్యానవనమందు మనసీతారత్నమున్నది.
పోయి యాపెను గలిసికొందమురమ్ము. (నిష్క్రమించును.)

(ఇది విష్కంభము.)

(ఉద్యానవనమందు సీతారత్నము ప్రవేశించుచున్నది.)

బేహాగ్ రాగము అటతాళము.

(ఔరానారీ మట్టు)

అకటమదనా వికటంబుతగునా॥ అ॥
సుకుమారినగునన్ను గికురింపనగునా॥ య॥
సరసిజనేత్రుని సాన్నిధ్యమునకు
వరకరుణను జేర్చి తరియింపరాదా॥ య॥
అరుదగునాతనో హరసంయోగమున
దిరుగుచుసంతోష భరమొందకుండ॥ న॥
రావుకులార్ణవ ప్రభుపుభుజంగ।
రావు కౌఁగిటనలరారకమునుపే॥ య॥

పదునుటమ్ముల నెదగుదియించుచున్న మదనుని గదురుతనము

నన్నుఁ ద్రిదశలోకమున కంపునట్లున్నదికాని బ్రదుకనిచ్చునట్లు లేదే! ఏమి సేయఁగలను?

ఉ॥ రావుకులాబ్ధిచంద్రుఁడు సురప్రతిభాసమదేహుఁడర్యుఁడు
భావజరూపవిగ్రహుఁడు పుణ్యకులాబ్జమధువ్రతుండు స
ద్భావితమైత్రిపాత్రుఁడుకృపారసమూర్తి భుజంగరాయఁడో
భావహనామకుండునను భావజకేళినిఁ దేల్పరాఁడొకో॥

సీ॥ రాకున్న నేరీతిఁ బ్రాణముల్నిలుపంగఁ జాలుదునిఁకనిమేసంబుగాని
ప్రాణమునిల్చినభావజతాప మెక్కరణినేభరియింతుఁ గలతమాని
భావజతాపంబుభరియింపగల్గినఁ జేరానవొవునే వెసగుఁ గాని
ప్రేరానవోయిన నారాముచిత్రముల్ మరపురానిచ్చునేకఆపు, గాని।

తే॥ గీ॥ మరపువచ్చినమాత్రాన మంతనంబు
విడువనేర్తునె యౌవనవేదనంబు
పట్టిపల్లార్చుచుండంగఁ బ్రాణనమితి
నిలుచుననుమాటయనవట్టి నీళ్లమూట॥

ప్రాణాసక్తిత్యజించిన మనసునకిట్టి సంకటములుండవు కదా ? (హాశ్చర్యము) ఆహా! ఇంతలోనే యింతతొందరపాటునాకుఁ జెల్లునా? నాతెలిమిక త్తెయగు సువదనునుపంపియుంటిని యామె యేయుక్తియో పన్ని నామనోహరుని నాకడకుఁగొనితేఁగలదు.

సీ॥ డెందమానీకు నానందంబుగలుగును
గొందలంబందకు డెందుశాంతి
హృదయమా వెఱవకు సదయుండు నినుఁ జేరి
ముదమొందఁగాఁ జేయుఁ గొదువఁదీర్చు
చిత్తమాభయమేల హృత్తటంబుననిన్ను
హత్తునీచెలికాఁడు కత్తలమున
మనమభీతిలఁబోకు మనసిజరూపుండు
కనినిన్నుఁగూడి మంతనములాఁడు

తే॥ గీ॥ నీదుగాఢానురక్తియా నీదు చెలిమి
కత్తె తెలుపంగఁజ నెనీనిమిత్తమిపుడు
సుంతయోర్పునుబొందుము వంతనొందిద
నేలయరుదెంచె ధవుఁగూడుకాలమిపుడు॥

ఏమో! నాలోనేను సరిపెట్టుకొనుటయే కాని యిదియంతయుజరుగునా? నామనస్తాపముతీరునా?

తే॥ గీ॥ నామనోహరుతోఁగూడి కాముకేళిఁ
దేలుకాలంబునాకుఁ బ్రాప్తించుదాఁక
మదికినూరటజనియించి కుదటపడునె
ఘనతరంబైనకలతను గాంచుఁగాక॥

కలతనుగాంచుట నిక్కమే కాని ఫలముగనుటయదృష్టసాధ్యము వజ్రపంజరమునుబోలిన యీమాడుగుపై కతఁడెట్లురాగలఁడు?

క॥ శ్రీరామానుతుఁబోలిన
యారావుకులీనుతోఁడ హర్షమునను నీ
యారామపుఁబొదలఁగలిసి
మారాగమమునను దేలు మాత్రముగలదే॥

దయామయుండును ఘటనాఘటనసమర్థుండునగు నీశ్వరునికరుణనాయందున్నచో నీపని నెఱవేరకపోవునా?

ఉ॥ ఓపరమాత్మ! శంకరుఁడ! యోసకలాత్మసమానపోష మ
త్తాపముదీర్పఁగాఁదగును దారగుణుండు భుజంగరావురిఁ
దాపునఁజేర్చితావులను దప్పఁగనుండిన నాదుప్రాణముల్।
నీప్రభుశక్తిచేమరల నిల్పఁగవేడెద నాదరింపవే॥

(తిరిగిచూచి) అరుగో! నాచెలులిరువురును నామనోగత కార్యమును నెఱవేర్చి యిటువచ్చుచున్నారు ఎదురుగాబోయి యడిగెదను (అనిలేచుచున్నది)

(రమణి సువదనలిరువురును ప్రవేశించుచున్నారు.)

(ఎదుటకు వచ్చి కవుఁగలించుకొని) సఖులారా కాయమా? పండా?

సువ—ఫలవంతమయిన నీమనోభూజమునఁ గాయలేలయుండును పండే?
సీతా—అటులయిన వచ్చియున్నాఁడా.
సువ—ఇద్దఱును గలిసివచ్చుచున్నారు.
సీతా—ఇద్దఱెవరు?
సువ—నీమనోహరుఁడును వానిసహచరుఁడగు విదూషకుండును గలిసివచ్చుచున్నారు.
సీతా—(సిగ్గుతో) చేటీ తానువచ్చెడిపనికి పరపురుషునితోఁ గూడివచ్చుట కెట్లంగీకరించినాడే.
సువ—(నవ్వుచు) నీవుపూనుకొనినపనిని మాతో నెట్లు సంప్రతించి నెఱవేర్చుకొనుచుంటివో యట్లే.
సీతా—నాప్రాణసఖులరగు మీకునునాకు నభేదగుణ ప్రతిపత్తిగలిగియుండుటచే మీకెఱిగించుట కొప్పుకొంటిని.
సువ—వారును బ్రాణస్నేహితులగుటచేత నే కలిసివచ్చుచున్నారు.
సీతా—చెలీ యాతనియెదుట నామనోహరునితో మాట్లాడుటకు సిగ్గుచే నోరురాదేమోయని భయమగుచున్నదిసుమీ.
సువ—మీరిరువురును మాటాడుసమయము వచ్చుసరికి మావలెనే యాతడును దొలఁగును నీకాభయమక్కఱలేదు లెమ్ము.
సీతా—(సంతోషముతో)

తే॥ గీ॥ ఎన్నిజన్మము లెత్తిన ఋణముతీర్పఁ
జాలనంతటి సాయంబు సల్పినావు
నిన్నుఁబోలిన చెలికత్తెలున్న వనిత
కావయంతయు లోపంబు నావహిలునె॥

సువ—నీస్తోత్రపాఠములకేనహర్హురాలనుగాను చెలిమికలయప్పుడొండొరులు సాయమొనరించుకొనుట విధికదా నన్నేటికగ్గించెదవు అదుగో నీచెలికాఁడు వచ్చుచున్నాఁడు నీప్రయత్నమునవీవుండుము
సీతా—ఏడీ నాకుచూపింపుము.
రమ—అదుగోకనుచూపు దూరమున నారాజమార్గము వెంబడివిహితునితోఁగూడి వచ్చుచున్నాఁడు.

సీతా—అవునే మున్నొకసారి నేనీతని జూచినప్పటికంటె నిప్పుడుమతి యు దేజముఁగలిగి ప్రకాశించుచున్నాఁడు.

సువ—వయోవతివయి మదనావేశమునఁ జూచునీదృష్టికి నీవలపు కాడ టులనే కనబడును లెమ్ము.

సీతా—అటుకాదు నిజముగా వానికి తేజము హెచ్చినది.

తే॥ గీ॥ అతనిధీరతయాతని యందమతని
ముఖవికాసము వెడదఱొమ్మునుగనంగ
నమరనాయకుఁడో కాకకమలశరుఁడొ
యనుచుఁదోఁచెడు తనుకాంతి యమరియుండె॥

సీ॥ వానిప్రక్కను జేరి పరిహాసములనాడు
తరుణిభాగ్యమునెన్న తరముగాదు
వానికౌఁగిటఁ జేరి వదనంబుముద్దాడు
వనితమోదమునెన్న వశముగాదు
వానిపజ్జనుపండి బంధనారతిదేలు
వెలదిసౌఖ్యమునెన్న వీలుకాదు
వానిముంగిటనిల్చి ప్రణయోక్తులనుబల్కు
కాంతతీరెన్న శక్యంబుకాదు.

తే॥ గీ॥ వానిముంగురుల్ మునివ్రేళ్ళవలన దువ్వు
నతివయుల్లాసమెన్న సాధ్యంబుకాదు
మగువనీదైనచాతురీ మహిమచేత
నట్టిచెలికాని పొందునా కమరనుండె॥

సువ—చెలీ యాతఁడు దగ్గరఁ జేరక మునుపే నీలోనీవయుబ్బొల్లొరు చుంటివేమే? మనసు నంతగా బట్టజాలకున్నావు కాఁబోలు.

సీతా-అవునే అదేమికారణమోకాని నాశరీరము బులకాంకురమయిప ట్టరానిసంతోషమున మైకము గ్రమ్ముచున్నదే. కన్నులు మూసి కొనివచ్చుచున్నవి.

సువ—అటులయిన నీతిన్నెపయిఁ బరుండుము మేమిదుపురము నించుక శైత్యోపచారముల నొనర్చుచుండుదుము

సీతా—(కన్నులుమూసికొని పరుండును.)

సువ—ఓసీరమణీ చూచితివా! దీనికి మదనతాపజ్వరమున నొడలెట్లు గాగుచున్నదో రమ్ము. మనము కొంచెము శైత్యోపచారముల నొనరించుదము.

రమ—(ఒడలు పట్టిచూచి) పాపమెంత వేడిగా నున్నది. నేనుబోయి మంచిగంధమునఁ బన్నీరు గలిపి తెత్తునా.

సువ—శీఘ్రముగాఁ గొనిరమ్ము. నీవు వచ్చుదనుక నేనుపచరించు చుండెదను.

సువ—అదుగో! భుజంగరావు తన సఖునితో ముచ్చటించుచున్నాఁడు. నేనీమరుగునుండి వీరిప్రసంగమును వినుచుండెదను. (అని ప్రక్కకుఁ బోవుచున్నది.)

(అంతయథోచితముగ భుజంగరావును విదూషకుఁడును ప్రవేశింతురు)

విదూ—ఏమోయి! భుజంగరావు! నీవ్యభిచారముకాదుగాని యూరంతయుఁ ద్రిప్పినది చాలక యీచెట్లచేమలలోని కీడ్చుకొనివచ్చి నామచ్చ మాపుచున్నావుగదా?

భుజం—సఖా! అంత యాయాసపడెదవేమి? నేనుమాత్రము నీతోఁ బాటు తిరుగుచుండుట లేదా? నాకు లేనికష్టము నీకెట్లుకలిగినది?

విదూ—చాలు చక్కఁగాఁ జెప్పితివి వలపుదుకత్తియ నెప్పుడు చూతు మాయను నాతురమునఁ జిక్కములోని పిట్టవలెఁ గొట్టుకొనుచున్నమనసుగలిగిన నీకుదారియు దొంకయు మార్గాయాసమును గనఁబడుచున్నవా?

భుజం—మిత్రమా! యీమాటలకేమిగాని, యెంతదూరము తిరిగి నను నాప్రియాంగన కానరాకున్నదేలొకో! మనము త్రోవతప్పి యుండలేదు కదా.

విదూ—నేను జూపింతునుగాని నాకేమిచ్చెదవు?

భుజం—హితా! నీకుఁ గనఁబడినచో దయచేసి చూపింపుము.

విదూ—నాకిచ్చెడిదానిఁ జెర్కొనుము. పిమ్మటఁ జూపించెదను.

భుజం—ఏమిచ్చెదనా? "నీకు మిత్రవత్సలు"డను బిరుదమిప్పించెదను. చాలునా!

విదూ—అబ్బా! ఎంతపనిని జేసెదవు. అది కాదు మంచిగారెలు, బూరెలు క్షీరాన్నములతోఁ గూడిన మృష్టభోజనమిప్పించెదవా?

భుజం—ప్రతిదినమును సత్రములలో కుత్తుకబంటి తిండిగల నీకింకను భోజనముమీఁద నే యాశయా?

విదూ—స్వకాంతాసంగమసక్తుఁడ వగు నీకుఁ బరకీయానురాగాశక్తి యెట్లో నాకుఁ బరభోజనాశక్తియట్లే.

భుజం—(తనలో) ఇతఁడు హృదయానారసమువంటి మాటను బ్రయోగించి నాఁడే కానిమ్మిప్పుడభిమానపడిన లాభము లేదు. (ప్రకాశముగా) వయస్యా! నీహాస్యోక్తులకేమి కాని యాచెలియను జూపుదునంటివే చూపుము.

విదూ—అదిగో! యాపువ్వుటేరమునఁ గన్నులు మూసికొని పరుండియున్న వనిత యెవ్వతెయో చూడుము.

భుజం—(చూచి) అవును యూతికాభావమును వహించిన యాపె చెలిమికత్తె నాతో నెన్నిగురుతులు వచించినదో యవియన్నియు నీ యువతియందుఁ గన్పడుచున్నవి. ఆహా! ఏమి యీ కురంగాక్షి యందము?

సీ॥ అపరంజిప్రతిమంబు నపహసించెడిమేని
శృంగారమును నేరి కెన్నతరము
బంగారుగిన్నెల పరిహసించెడిగుబ్బ
గవయందమెన్నఁగా నెవరితరము
పండువెన్నెలనవ్వు వనితాస్మితముఖాబ్జ
భాగ్యమెన్నుటకు నెవ్వారితరము
స్మరచాపములనేలు తరళాక్షి కనుచూపు
తెరఁగెన్నుటనఁగ నెవ్వరికిఁదరము॥
తే॥ గీ॥ ఎన్నిజన్మములెత్తిన నిట్టిబోటి
తోడమంతనంబులనాడ గూడునొకొ.

పూర్వభవపుణ్యఫలముననఁ బొసఁగెఁగాన
జన్మసాఫల్యములభించె సవ్యముగను॥

విదూ—హితుఁడా! యారామామణిఁ నీవంకఁగన్నెనెత్తి చూడక మునుపే నీవిట్లుమనఃకల్లోలము నొందుటచూడ నాకు మిక్కిలివింతయగుచున్నది "ఊరిముందఱికివచ్చినపిమ్మట నుఱుకులు, బరుగులు" ననునట్లు నీకిప్పుడు తొందరపాటుకలిగెనా, మనస్థిమితమును గనఁజాలవా.

భుజం—అట్లుకాదు ఈవిషయమునీవనుభవసిద్ధముగా నెఱుఁగమినిట్లనుచున్నావు కాని సుందరవిగ్రహయగువనితారత్నమును గాంచినప్పుడు వారియొక్క.

చ॥ ఘనకుచయుగ్మముల్ దళుకుఁగన్నులుఁ జంచలమైనదృష్టులున్
ననవిలుకానివిండ్లవలెనభ్రములతో కనుబొమ్మలున్ శశాం
కుబినగుమోము చూపరులకున్ గడుమోదముగూర్చువేణియున్
మిసమిసలాడుదేహమును మింతులమానసముల్ హరింపవే?॥

విదూ—మనస్సునుహరించినంతమాత్రముననుచితానుచితముల నెన్నక వెంబడి కులకాంతలనంటఁబ్రయత్నించు టెట్టితగవు.

భుజం—ఇందనుచితమేమున్నది.

ఉ॥ మోమునఁబుట్టులేనగవు ముద్దులుగుల్కు మృదూక్తులున్ భళీ
త్కామమునించు చూపులును ఘల్లలమ్రోగెడునూపురధ్వనుల్
కోమలదేహసౌరభముఁ గూడినయాయభిసారికామణీ
స్తోమముఁగూడఁ గాముకులు చుట్టునుద్రిమ్మరు టొప్పదేసఖా॥

సువ—(సీతారత్నమును సమీపించుచుఁదనలో) నాదూతికాకృత్యము చక్కఁగా ఫలించినది ఇఁక సత్వరముగా చెలికత్తెను మేల్కొలుపుదునుగాక (లేపుటనభినయించి) సఖీ! నూతనసూర్యరశ్మికృత ముకుళీభూతనయననీలోత్పలములు ప్రియచంద్రదర్శనానంతరమేనియు వికసింపకున్న వేల లెమ్ము.

సీతా—(లేచికన్నులు నులిమికొనుచు) ఇదేమే ఇంతదనుక నాచెంత

మెలంగుచున్న నాచెలికాఁడు కన్ను తెఱచునప్పటికే మాయమయినాఁడు.

సువ—కలగంటివి కాఁబోలును.

సీతా—నిజముగా రానే లేదా.

సువ—ఇచటకువచ్చియున్నాఁడుగాని నీచెంత మెలఁగినాఁడనుట కలయే.

భుజ—వయస్యా! వీరిప్రసంగమువలన నావలెనే యీమెయు మదనావస్థలోనున్నట్లుస్పష్టపడినది యింకయు నేమి చెప్పకొందురో విందము

విదూ—"పాములజాడపాములది పాములజాడసాములది" నీవింతలో వారి ప్రసంగము నెట్లువింటివి.

భుజం—నిశ్శబ్దముగానుండుము వారిపలుకులను విననిమ్ము.

విదూ—అవును చక్కఁగాఁజెప్పితివి "గడచిన గండఁడుమిండఁడగు" ననుసామెతవినలేదా.

భుజం—(విసువుతో) మిత్రమా క్షమించి యూరకుండుమా.

సీతా—ఏడీ.

సువ—అదుగో యీ పూలచెట్టు చాటునున్నారు. ఇఁకనీప్రయత్నమున నీవుండుము. నేఁబోయెదను. (నిష్క్రమించుచున్నది.)

సీతా—(తొంగిచూచి సిగ్గుతోఁ తొలఁగుచున్నది)

భుజం—విదూషకా! చూచితివా నీవుకూడ నుండితివనుట సూచింపుటకై సిగ్గుచే మరుఁగయినది. అహా యీమె యెంతప్రౌఢ.

విదూ—యీ పాపకర్మమునకు నేనొడిఁగట్టుకొననేల? నేనవతలకేగెదను నీప్రయత్నమున నీవుండుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

భుజం—(సమీపించి)

మ॥ అతివా! నీదగుదర్శనార్థమయి మార్గాయాసము న్జూడకే
నతిసంతోషముతోడవచ్చితిని నీదౌ కౌఁగిటం జేర్చి స
త్కృతిసేయందగు నింక నేని బరమార్థీభూత చిత్తమ్మునన్
శతపత్రాంబకు బారినుండి దరిజేర్పన్నిన్నుఁ బ్రార్థించెదన్॥

సీతా—(ముందునకువచ్చి.)

చ॥ ఇతనితనూవిలాసమున కీడగుఁజుల్కల తీరుదానికిన్
జతయగుఁజాతురీకలన చాతురికన్నను మారశాస్త్ర పాం
డితియధికంబుస్గంతకుఁ గడిందివయ్యోవిభవంబు దానిచేఁ
బ్రతియభిసారికామణికిఁ బ్రాణవిభుండనఁ జెల్లునీతనిన్॥

మనమున నెంత త త్తరపాటొదవుచున్నను నోట సమాధానము జెప్పుటకు సిగ్గగుచున్నది. (సిగ్గుచేఁ దలనొంచుకొనుచున్నది.)

భుజం—(తనలో) మిన్నకతలవంచుకొని యూరకున్న దేలకో! ప్రౌఢయైయుండబోలు. కావుననే సిరు త్తరమే యంగీకారసూచకమని తెల్పినది. అయిననింకొక్కసారి యడిగిచూచెదను (ప్రకాశముగా)

మ॥ పలుకే బంగరమా మృగాక్షి! పిలువం బల్కాడకున్నావు నా
వలనన్నేరము గాంచినావా ననుసంభావింపఁ గానెంచవో
యలుకంబూనితివో చలోక్తికయి హాస్యప్రాయమున్ జూపవో
చలముంబూనక ప్రేమ జూడుమిఁక నాజన్మంబు సాఫల్యమౌ॥

మఱియు.

ఉ॥ ఎందఱు పూరుషాగ్రణులు నెందఱుసుందర రూపవంతు లిం
కెందఱుగొప్పవారు కలరిందటి గోపలనేరినట్లు నా
యందుననీకు మోహమది యబ్బుటనాదగు భాగ్యరేఖయే
సుందరి! చెంతఁజేర్చుకొని సూనశరాగమముల్ స్మరింపవే॥

సీతా—(తనలో) అకటా యెంతయని యోర్చుకొందును. సిగ్గేటికివ్యక్తీకరించెదఁగాక (ప్రకాశముగా)

తే॥ గీ॥ స్వాతివానకు ముత్తెపుం బరణియట్లు
నిన్నుఁగోరుచు గాలంబు నెన్నుచున్న
నాకుదర్శనంబిచ్చి సంతసముగల్గఁ
జేసితివెయింకఁ గొదవేమి చెలిమికాఁడ॥

భుజం—(తనలో) ఇప్పటికిగదా ధన్యుఁడనయి పడినపాట్ల కెల్లఫలమునుగాంచితిని. (ప్రకాశముగా)

తే॥ గీ॥ పూర్వభవమందుఁ జేసినపుణ్యమునను
నీదుదర్శనభాగ్యంబు నెమ్మిఁగలిగెఁ

గానినీదయకలిమిచేఁ గమలశరుని
కేళిసంప్రాప్తమగుఁగాక నీలవేణి॥

రాగము— ఏకతాళము.

(తప్పు క్షమియింపుమయ్యామట్టు)

సీతా—ననుఁగృపజూడుమయ్య నాయకనీదాననయ్య
వనవిలుకాని కేళిఁగనఁగఁజేసి మనుపుమయ్య॥ నను

భుజం—ఘనముదము య్యోనేడు వనజపత్రనేత్రనాకు।
తనరునీదు యౌవనంబు తద్దయునాపాలుసేయ॥ ఘన

సీతా—ప్రమదవనమధ్యమందు భాసిలుమందిరమునందు
విమలమణిస్థగితమైన వేదికనలంకరించి నను

భుజం—ఇందునిన్ను గూడియున్న మందయానతంద్రినన్ను
బంధనాలయంబుసేర్చి బాధపెట్ట నెంచునేమొ॥ ఇం

నీవన్నివిషయంబుల నాకుఁ దోడ్పడియుందునని వాగ్దత్తముసేయుము నిక్కముగా నిన్నేకూడియుండెదను.

సీతా—(తనలో) నేనుతనమాట జవదాటుదునేమోయని సందేహించుచున్నాఁడు కాఁబోలును (ప్రకాశముగా)

తే॥ గీ॥ మనమునందుననిను దైవమనుచుఁదలఁచి
జీవితాంతముదనుక నీచెంతమెలఁగు
చుందుదానను నుఁడి విభవోన్నతగతి
నన్నుఁగైకొమ్ము నీకుఘనమ్ముగలుగు॥
(అనిచేతిలోఁ జేయివేయుచున్నది.)

భుజం—(తనలో) అన్యాయాలశాతవ్వ చేతఁజేయిడినన్ను స్పృశించినంతమాత్రముననే విరహజ్వరమునఁ గాగుచున్న నాశరీరము సమశీతలభావము వహించినదికదా (ప్రకాశముగా)

తే॥ గీ॥ ఎట్టికష్టములలిగిన నిందువదన
సుఖములైతోఁచునినుఁ గూడుచోనవన్ని

పాలెగానికి వ్యవసాయ ఫలముగన్న
దున్నకష్టంబు మదిలోనఁ దోఁచనట్లు॥

(అనిసీతారత్నము పైనఁజేయిడి) సచ్చేఁనీప్రమదవన విశేషంబుల నాకుఁ జూపించెదవురమ్ము.

మలయమారుతము ఆటతాళము.

(కాంతకాంత లతాంతములు మట్టు)

సీతా—మల్లెమొల్లలు నల్లుకొని పందిళ్ళుసొంభ మెల్లమదిరం
జిల్లఁజేయుచు నున్నవిమనో వల్లభా యిటు చూడుమీయెడ॥ మ

భుజం—కమలపత్ర ప్రమదవనశృంగారమింతని చెప్పశక్యమె
యమరవిభునినంద నోద్యానమును దీనికిసాటియగునే॥ కమ

సీతా—మంచిగంధపుఁ దరులుమఱి చేమంతి మొక్కల బోదెలుఁగ
మంచివాసనల పరిమళిమ్ముచు మదికిముదమును నొదవజేసెడి॥ మ

భుజం—అతివ! వనమందిరములోపల ననమశర కేళివసింపఁగ
నతిముదంబునఁ జేరఁబోవుదమాలసింపక రమ్ముపోదము॥ అతి॥

(ఇద్దఱునిష్క్రమింతురు)

అంత యథోచితముగ రమణిసువదనులు (ప్రవేశింతురు)

రమ—మన చెలికత్తె కనుపించదేమే మదనతాపరహిత మయిన దా యేమి ?

సువ—నీచేతిలోనిది గంధపు గిన్నె యేనా ?

రమ—అవును.

సువ—ఇంత త్వరగా వచ్చితివేమి.

రమ—ఆ నీకేమి ? ఎగతాళి మాత్రము చేసెదవు. అక్కడ ఎంతగం ద్రగోళమయినదో నీకు తెలియునా ?

సువ—ఏమిజరిగిన దే.

రమ—ఏమిజరిగినదా గుట్టు బయటఁ బడినది.

సువ—ఎవరిగుట్టు.

రమ—మన సీతారత్నము కుట్టే.

సువ—ఎట్లు తెలిసినది.

రమ—ఎవరు చెప్పిరో కాని పూసలు గ్రుచ్చినట్లు కథయంతయుఁ దెలిసినది. భుజంగరావును బట్టుకొని తగు ప్రాయశ్చిత్తము చేయవలయునని వణిక్పతియు నాతని కొడుకును గూడ ప్రయత్నించుచున్నారు.

సువ— చాలును లెమ్ము. అతఁడు వీరియట్టివారిని లెక్కపెట్టునా కడు సాహసము కలవాఁడని నీవుమాత్రమెఱుఁగవా ?

రమ—ఎవరికెంత సాహసమున్నను ప్రభుత్వమువారికి లోఁబడవలయునుగదా యితఁడేమి చేయఁగలఁడు.

సువ—వలసినచో నితనికొఱకు గావలసినంత ద్రవ్యము వెచ్చింపఁగల స్నేహితులితని కనేకులున్నారు.

రమ—సరే మనమింటికిఁ బోదము రమ్ము మనకిందులో సంబంధమున్నట్లు తెలిసినచో మన సంసారములకుఁ జేటుగల్గును.

సువ—అవును. నిజమే పోవుదము.

(నిష్క్రమింతురు.)

ఇతి శ్రీమత్కాశీనాథుని వీరమల్లయారాధ్య
విరచిత సీతామనోహరనాట
కంబున ద్వితీయాంకము.

శ్రీ

శుభమస్తు.

# సీతామనోహరము.

## తృతీయాంకము.

(వణిక్పతియు సోముడును బ్రవేశించుచున్నారు.)

వణి— కుమార, కాలమున కెన్నడెఱుంగనిముప్పు సంభవించినదికదా యీ పెద్దమ్మ నాకడుపున జెడబుట్టినది.

సోము— ఏమిప్పుడు పరిత్యాగము సంభవించినది?

వణి— కావలసినదంతయు నయినది ఇంకేమి కావలయును నాపరువు ప్రతిష్ఠలన్నియు నట్టేటగలిసిపోయినవి.

తే॥ గీ॥ నీదు పెద్దచెల్లెలు సీతనీతివిడచి
మిండగానిని జతజేర్చి మెలగుచుండె
నను చుమింటిని నోసట నావనజభవుడు
వ్రాయుగీతను దప్పింపవశమె మనకు॥

సోము— ఎంతనుకొంటిమో యంతయుసంభవించినది యిప్పుడు చింతించి నంతమాత్రమున బ్రయోజనమేమి.

ఉ॥ నెత్తిననోరు పెట్టుకొని నీవిటు సేయకుమంచు జెప్పినన్
జిత్తమునందు జేర్చకిటు సేసినపెండ్లికివచ్చె దిప్పలీ
పత్తనమందనన్ గులమువారలలోపల సిగ్గుచే శిరం
బెత్తుటకేనిపిప్పుడని హీనతకల్గెగ దాచిరంబుగన్

తగినవరు నీజూచి పెండ్లివిగావించినచో నిట్టిపాటురాదుగదా అప్పటి మీ మూర్ఖతయే యిప్పుడిట్లు పరిణమించినది. కానిమ్ము.

ఉ॥ మించినదానిగూర్చియిటు మిమ్మనినందునలాభమేమి యీ
వంచన జేసినట్టి మనవైరికి నేగతిబుద్ధిసెప్పగా

నెంచితిరో బిరానవచియింపుడు వేగమె వానిని న్నిరో
ధించకయున్నఁ జేటగును దిట్టపుఁబన్నికఁ బన్ని చెప్పుమా॥

కొండొక నేరము గల్పించి వానిని శిక్షింపఁ జేయుకున్న మరింత గావృద్ధియగును కావున బాగుగా యోచింపుఁడు.

వణి— (తనలో) వీఁడు నాకంటె నెక్కుడు క్రౌర్యమును బూనియున్నాఁడు కాని యాతులువకుఁదగిన ప్రాయశ్చిత్తము సేయించవలసినదే యిట్లగుగాక (ప్రకాశముగా.)

ఉ॥ గతజలసేతుబంధనము కార్యము లేదు నిదానమున్నచో
నితనికిఁ దగ్గశిక్షవిధియించెదు మార్గముజూడవచ్చు దొం
గతనము సేయఁగా మనయగారము సొచ్చెనటంచుఁ బన్నియా
వితమునుబంటుకాతులకు వెల్లడిచేయుట యుక్తమియ్యెడన్॥

మఱియు,

తే॥ గీ॥ అట్లుచేసిన తత్క్షణమతనిఁబట్టి
బంధనాలయమందుంచి పరిభవించి
బుద్ధిసెప్పుదురాపైన మూర్ఖతముని
న్యాయసభలో విమర్శింతు రమలమతులు.

సోమ— తండ్రీ! అది యకృత్యప్రధానవర్తులకు లక్షణముగాని మనయట్టివారలకు గాదు. ఇటుఁవినుడు

చ॥ అనృతముబన్ని న్యాయమును నావలబెట్టి పృథాగ్వ్యాజ్యముల్
బోనివినమాత్ర నేగతిని సూనృతవాక్యవిహీనమైన వ
ట్లను జయమొందజాలుదుము లాతిజనంబులు నవ్విపోరె యో
చిన నిజమేలదాఁచవలె డెందమునందునఁ జింతసేయుఁడీ॥

ఇంకొక్కటిగూడ నాలోచింపుఁడు.

తే॥ గీ॥ నిజముఁజెప్పిన వ్యాజ్యంబు నిలుచు మనకు
ననృతమాడిన గెలుపెట్టు లరయఁగలము
"సత్యమేవజయతి" యన్న శాస్త్రవిధిని
మీరుమాత్రమెఱుంగరే మృదులభాష॥

వణి—ఓరి పిచ్చివాఁడా! ఇటువినుము.

ఉ॥ కూతురు అంకుఁ జేసెనని కొండొకసిగ్గును లేక యేగతిన్
నీ! తలయెత్తి చెప్పుదును జెప్పిననేగతి వారునమ్మఁగాఁ
జూతురు పిన్నపెద్దలు ననూయతనూపరె! పెక్కులేల? నా
జాకతమిట్టులుండఁగ విచారణసేసిన లాభమేమొకో॥

అనియును గాక,

తే॥ గీ॥ పూర్వకృతపాప మీరీతి గర్వభంగ
మును బొనర్చుచునుండంగ మనమునందు
జింతనొందుటచేత నానంత యేని
విడిచిపోవునె ఫలితంబుగుడువకుండ॥

సోమ—(తనలో) పట్టుదలనువిడిచి వైరాగ్యములోనికి దిరుగుచున్నాఁడు. ఇప్పట్టునఁ గొంత ప్రోత్సాహ మొనరింపవలయును. (ప్రకాశముగా)

తే॥ గీ॥ మీరు మీలోనఁగుందిన మేలుకలదె
తగునుపాయముచేత నాతనిని వంచ
నమ్మునేయక యున్న ఫలమ్మువమ్ము
పాపులకుశిక్ష లేకెట్లు వచ్చుబుద్ధి॥

కావున మీరీవిషయమునఁ దగుప్రయత్నముసేయుటయే యుక్తమని నాయభిప్రాయము విన్నట మీయిష్టము.

వణి—(తనలో) వీఁడు చెప్పునదంతయు యథార్థమే "తోటకూరనాఁడే చెప్పవై తివేమిరా" యన్నట్లు ప్రథముననే యీదుర్నయమును నడఁచివేయవలయును. (ప్రకాశముగా)

తే॥ గీ॥ అయినఁగానిమ్ము వాని దురాగతమ్ము
నకుఁ దగినశిక్ష వేయింప న్యాయసభకుఁ
బోయివచ్చెద పనిఁబూని ముందునీవు
నాదురాత్ముని బోకుండ నాపుమిచట॥

సోమ—చిత్తము. ఆపని నవలీలగా నొనరించెదను.

తే॥ గీ॥ పూవుఁదోటను జేరి యాముగ్ధ కాంత
మనము సెడఁగొట్టి యావితో మంతనమ్ము
లాడుచున్నట్టి ఖలుఁబట్టి యతని హస్త
ములను బెడఁగట్టియుంచేద బోయిరండు॥

తండ్రిగారు! ఇంకొకమాట,

చ॥ ధన మొకయింత హెచ్చయినఁ దప్పక వ్యాజ్యము గెల్చునట్లుగాఁ
బనిఁగొను న్యాయవాదిని వివాదము సేయఁగ నిర్ణయించి, తీ
వినిఁ దనస్వాంత కార్యముగ నెమ్మిఁ దలంచు మటంచు వేడి గొ
బ్బునఁ బురరక్షకాధిపుని ముందిటకుం గొనిరమ్ము వేగమే॥

వణి—అదిఅంతయు నేనెఱుఁగుదును లెమ్ము. నీవుమాత్రము వానినిఁ బోకుండ నెదిరించియుంచుము. పదిడబ్బులు పోయినను బురరక్షకస్థానాధిపతినిఁ దీసికొనివచ్చి యితనిఁ గొట్టులోఁ బడవేయించెదను త్వరగాబొమ్ము.

సోమి—చిత్తము. (ఇరువురును నిష్క్రమింతురు.)

(అంత యథోచితముగ సీతారత్నమును భుజంగరావును ప్రవేశింతురు)

భుజం—మనోనాయకీ! నేడు మనము వినిన విచారకరములగు వార్తవలన నామనము కలతనొందుచున్నది. అనతికాలవ్యాపితమైన మన మోహలతానికుంజమును ఛేదించుటకు నీతండ్రి యనూయాలవిత్రపాణియై బయలుదేరినాఁడు కదా! మనము పరస్పరవియోగమున బ్రతుకఁగలమా?

సీతా—మీకీ వెఱ్ఱి యేటికి? మనమోహబంధము పరప్రయత్నమున నేర్పడినదా, పరప్రయత్నముచే విడఁగొట్టఁబడుటకు ఎవరెట్లువిఘ్నము సేయఁదలచినను జీవితాంతముదనుక మనచెలిమి వీడిపోవదని యే నాయభిప్రాయము.

భుజం—అంత స్నేహమెక్కుడుగానున్న దాసికిఁదోడుగా నేకస్థలనివాసాహర్తయున్నచో మనస్థిమితముండునుగాని లేకున్న నీయనురాగము నిష్ఫలమేకదా!

సీతా — మనము ముందుగనే భయపడ నేల?

తే॥ గీ॥ జరుగనున్నది యెట్లైన జరుగుగాని
చింతనొందినదీరునే సిలుగులెపుడు
కష్టసుఖములు కావడికడవలన్న
సామ్యమును మున్నువినలేదె సన్నుతాంగ

తే॥ గీ॥ మిన్నువిరిగి పైఁబడనున్నఁ గన్నతల్లి
దండ్రులెన్నెని విధముల దలఁకి నన్ను
శిక్షఁ జేసినఁగాని నీచెలిమివిడువఁ
గట్టిగానమ్ము మిది మనఃకమలమందు॥

భుజం — (తనలో) ఏమి యీమెసాహసము మనోనిశ్చయమన్న నిట్లుఁడవలయు. ఇంతధైర్యము పురుషుఁడనైన నాకుఁగూడ లేదు స్త్రీలే సాహసకృత్యములందుఁ బ్రథమగణ్యులు. (ప్రకాశముగా) ప్రాణేశ్వరీ!

మ॥ పరితాపంబిసుమంతయేనియు మనఃపద్మంబునం లేదు సుం
దరి నీపల్కుల మాధురీమహిమచేతన్ మాయమైపోయె, నీ
కొఱకై ప్రాణము లైనఁ బాసెదను నాకుంగార్యమానన్న మా
తతిచేఁ సాయముసేయఁగావలెసుమీ దైన్యంబురాకుండఁగన్

మఱియు,

తే॥ గీ॥ ఎట్టిపన్నికపన్నునో యేమొనన్ను
వంచనమ్మునుసేయఁగ వనితనీదు
తండ్రి, దానికిఁదగిన పద్ధతినిఁబన్ను
కొనఁగ వలయుఁగావున బోవ ననుమతిమ్ము॥

సీతా — (తిరిగిచూచి) నాథా! నాచెలిమికత్తెయగు సువదన యిటువచ్చుచున్నది. ఆమెవలనమనము కొన్నివిశేషములను దెలిసికొనవచ్చును.

సువ — (ప్రవేశించి తనలో) అకటా! వీరిరువురును వేటకాని కుదురయ్యెడుహారిణయుగ్మమువలె నిచ్చటనేయున్నారే! పిలిచిచెప్పెదనుగాక.

(ప్రకాశముగా) చెలీ! యొకసారియిటురమ్ము
సీతా—(సమీపించి) విశేషము లేమేనిఁ జెప్పెదవా?
సువ—చెప్పెదనురమ్ము (చెవిలోఁ జెప్పుటనభినయించుచున్నది)
సీతా—అటులనా? నేనిప్పు డేవచ్చెదను నీవు ముందుగా బొమ్ము.
సువ—మంచిది. (నిష్క్రమించుచున్నది.)
భుజం—(సీతారత్నముదగ్గరకువచ్చి) ప్రియసీ! నీచెలిమికత్తె యేమని చెప్పినది. మనమనుకొన్న దానికేమైన భిన్నమున్నదా?
సీతా—ఏమియు భిన్నములేదు. మీతోఁ గలహించుటకై నాసోదరుఁడు వచ్చుచున్నాఁడట నీవెంతమాత్రమును భయపడవలదు. నీపైనఁ దెచ్చెడు వ్యాజ్యమునకయ్యెడు ధనమంతయు నేనిచ్చెదను ఇట్టిసమయమున మనమిరువురము నొకచోటనేయుండుట కజ్జంబుగాదు, నేను బోయివచ్చెదను. (నిష్క్రమించుచున్నది.)
భుజం—తుదకు నాకు గళబద్ధయోగము సంభవించినది. ఇఁకేమిసేయుదును.

సీ॥ మగువవాడు సమాగమంబుగోరినమాత్ర
మదివిచారణలేక మరులుకొంటి
మరులుకొంటినెచూడు మగనాలిగృహమందు
నడుగువెట్టితి సంశయంబులేక
నడుగువెట్టిననేమి యపుడెక్రమ్మరిపోక
మంతనంబుననుంటి నింతదనుక
నుంటినేచూడుమీ యింటిలోపలగూఢ
వృత్తినయ్యదివారి కెట్లుతెలిసె
తే॥ గీ॥ తెలిసెననుమాట వినినంతఁ దెలివిగలిగి
గోడదాటక నెచ్చెలితోడమాట
లాడి యాలస్యమును జేసి హానితెచ్చు
కొంటి మేలౌనె వ్యభిచారకులకునెందు॥

ఇట్టివనులచేత నేకదా భిన్నాభిప్రాయులై జనులలోఁ గొందఱు పరస్పర కలహపాత్రులగుచున్నారు.

చ॥ కులటలఁగూడ్చునప్పుడె ప్రకోపము గల్గును నొండొకండ్రకుఁ
గులవనితాళిఁ గలియఁగోరినయప్పుడు దానితల్లిదం
డ్రులు సహియింతురే! మదివిరోధము బూనక మాధవ త్రి నీ
వలఁదగులొందినాఁడ బొరపాటును జేసికృశింప నేటికిన్॥

దూరాలోచనలేక బహుజనదూష్యంబగు నీయకృత్యంబును బుద్ధిపూర్వకంబుగా నొనరించి పైనిపుడు చింతించుట గతజలసేతుబంధనము కాదా! ఇప్పుడు తప్పించుకొనిపోవు మార్గమాలోచించవలయును.

తే॥ గీ॥ మొదట యోజించి మెలఁగుట ముఖ్యమందు.
మించిపోయినతరువాతఁ గించవడక
తప్పుకొనుమార్గమును జూచుటొప్పనదియు
వీలుగాకున్న నెదిరించి వెడలవలయు॥

(తెఱలో)

(చ॥ పరువుప్రతిష్ఠలన్ విడచి ప్రల్లదుఁడై గృహమందుఁజొచ్చి కా
వరమున దుష్టకార్యమని భావమునన్ గణియింపకుండఁ ద
స్కరునివిధంబునన్ జెఱుత జవ్వనికూ నసమ న్హరించి నే
డరమరలేకచిక్కునధమాధమునిన్ బలియిత్తుభూమికిన్॥)

(ఆలకించి) క్రోధావేశుఁడై సోమయ్య యిటువచ్చుచున్నాఁడు. అకటా! అనుకొనినంతయు జరిగినది. ఇపుడేమి సేతును? ఏపనిఁ జేయుటకును మనోజనము తగ్గిపోవుచున్నది. దోషకృత్య మొనరించినవారికి మనస్థిమిత మెక్కడనుండివచ్చును? (యోజించి) ఇతఁడు తిరిగివెళ్లుదనుకనిందే యొచ్చట నైన దాగియుండెదను. (చాటుననిలుచును.)

సోమ — (ప్రవేశించి కోపముతో.)

చ॥ పరువు ప్రతిష్టలన్ విడిచి ప్రల్లదుఁడై గృహమందుఁజొచ్చి కా
వరమునదుష్టకార్యమని భావమునన్ గణియింపకుండఁ ద

స్కరునివిధంబునఁ జెలుత జవ్వనిమానసమ్ముఁ హరించి నే
డరమర లేక చిక్కు నధమాధమునిఁ బలియిత్తుభూమికిఁ॥

(అటునిటుచూచి) ఏడీ! యెచ్చటను గనఁబడకున్నాడేమి? చేసిన తప్పు మనసున కెక్కినది కాఁబోలును.

తే॥ గీ॥ చిరతరాభ్యాసమునను నీవరుగుచుండు
వారవనితల గృహమునందు వచ్చియుంటి
వేమొ నీపాట్లఁజూపింతు నిపుడురమ్ము
దాగియుండిన నీచావు తప్పఁబోదు॥

(కోపముతో) ఓరీ! పాపవిచారా! నయవిదూరా! ఏమూలనక్కియుంటివో బయల్పడకున్నావేమిరా?

తే॥ గీ॥ దరియఁ దెన్నను గానక తల్లడిల్లి
ప్రాణభీతిని నెందేనిఁ బరువువిడిచి
కంటఁబడకుండఁగా దాగి యుంటివేమొ
శూరగుణధామ జితసోమ సోమభూప॥

ఉ॥ ఇయ్యెడఁగాదుఘోరవని కేగిభయంబున డాగియుండినన్
న్యాయ్యమువీడినట్టి మనుజాధమునిన్ బరిమార్చకుండ నా
దయ్యమువృద్ధినిచ్చునొకొ తప్పక దైవమొ లేకమేమొ సా
హాయ్యముసేయవచ్చెడు భటాళియొ నిన్ను వధింపకుందు మే॥

తక్కినవారిమాట లిప్పుడేటికి? ముందుగ నేనీపనికై వచ్చియుంటినిగదా? ఆదుర్మార్గశిఖామణి యీదివ్యభవనంబున నేమూలను డాగియున్నాఁడో చూచెదనుగాక ఇంతలోఁ దండ్రిగారుకూడ వత్తురు (అని నలుదెసలను వెదుకుచు లోనికిఁబోవుచున్నాఁడు.)

భుజం—(ప్రవేశించి) వీనిమాటలనుబట్టిచూడఁగా నిది సామాన్యముగాఁబరిసిపోయెడునట్లు కనుపించుటలేదు. నేను భయపడినట్లు వీరు కనుఁగొనినచో నన్ను మరింత ధిక్కరింపఁజూచెదరు కావున నిర్భయముగానుండవలయును.

సోమ—(పరుగెత్తుకొనివచ్చి విటునిచేయిఁ బట్టుకొని)

ఉ॥ ఎచ్చటికేగుచుంటివిర యెంగిలిమెక్కెడి కుక్కరీతి నిల్
సొచ్చితివింక నేనువెనజూడక నాదగుతల్లిదండ్రులు
న్మెచ్చునటుల్ పొడింబొడిగ నిన్నిటఁ దన్నెద, నామిషంబుకై
మచ్చము గాలముం దగులు మాడ్కి నీఁ జేతికిఁ జిక్కినావురా॥

భుజం —(తనలో) ఓహో! వీనివదరుబోతుతనము హెచ్చుగానున్నదే కానిమ్ము నేనే యించుకయోర్పు వహించెదను.

సోమ — కానిమ్ము నీకు కాలముసమీపించుటనుబట్టియే యిట్టిదుర్బుద్ధి యుత్పన్నమైనది.

తే॥ గీ॥ ముద్దరాలిని నెట్టిట్లో మోసగించి
యొద్దఁ జేరితివార నీయూహ కేమి
కాని యాసైంధవాదులౌ కాముకులకుఁ
గలిగినట్టి సౌఖ్యమునీకుఁ గలుగుఁగాక॥

భుజం — చాలు నిఁక నోరుమూయుము సిగ్గుచేఁ దలవంచుకొనక తగుదునని మాటలాడెదవేల?

సోమ — ఏమీ నోరుమూయవలయునా?

ఉ॥ మట్టెద, నేలఁ బెట్టెదను మాయిలుసొచ్చిన నిన్నుఁ గాలితోఁ
దట్టెదఁ బాపకార్యఁపువిధంబును బూను దురాత్మ నిన్నినుఁ
మొట్టెద నింక నెచ్చటికిఁ బోయెదవోరి, పరాంగనామణిఁ
ముట్టిన వాడె చచ్చితివి మూఢకులాధమ కాచుకొమ్మిఁకఁ॥

భుజం — ఊరకొనినకొలఁది నీకు నోరు హెచ్చుచున్నదిగా! ఓ ప్రేలరీ నీ వాచాశూరత్వమును జూచి యిచ్చట భయఁపడు వారెవరును లేరు. మర్యాదగా విరమింపుము.

సోమ — నీయంతము కనుఁగొననిదే విరమించువాఁడీ సోముడు కాఁడు. టక్కరిమాటలతోఁ దప్పించుకొని పోవలయునని ప్రయత్నించుచుంటివి కాబోలు నట్టి ప్రయత్నములు నాయొద్దసాగవు.

భుజం — మూఢుఁడవగుటచే నట్లనుకొనుచుంటివి. నేను స్పష్టముగాఁ జెప్పెదను వినుము.

ఉ. నీదగుసోదరీమణికి నెయ్యముసూపెడు బావనైన నా
మీద ననూయఁజూపుటది మేలటరా పదియుందిలోన దా
యాదులు నవ్వి హోదురని ద్వైనను గుట్టున కంచుకోక నీ
గాదిలిచెల్లి గేలివడఁగా నిటురట్టొనరింతువే ఖలా!

సోమ—ఓరివాచాటా! అంతకిపురజనవిటా!

ఆ॥ వె॥ ఆఁడుదానిపోల్కి నంతరంగములోన
నడరుపుట్టుచుండ నడఁచిపెట్టి
పైకిబేరములను బల్కనేటికిమూర్ఖ
నోరుమూయుమింక నుడువు లేల?

భుజం—అరే! మూఢా గర్విసరచక్రవర్తీ!

సీ॥ అనదయాజామాత నంగీకరించిన
నీతండ్రిమగలింపఁ జేతకాక
పెండ్లియాడినయట్టి పెండ్లాముసంతోష
పఱుపనిభావతోఁ బల్కలేక
మదనార్తిఁ జేజాల మరిగి వేఱొకభర్తఁ
జేరినచెల్లికిఁ జెప్పలేక
కులపుమర్యాదను నిలుపజాలనినీదు
చిత్తవృత్తికి బుద్ధిసెప్పలేక

తే॥ గీ॥ నిప్పఁద్రొక్కిన కోతినాఁ గుప్పిగంతు
లిడుచు నన్నుదూరెద వేల హీనగుణుఁడ
కట్టిపెట్టుము చాలు నీగుట్టుబయట
వేసికొనుచుంటి విదియెంత వెఱ్ఱితనమొ॥

సోమ—కుటిలహృదయా! నీ నీతికి జాలసంతసించితిని, నీవుచెప్పినదాని
కంటె సిగ్గువిడిచి నీవు మాటలాడుచున్నందుకు నాకుసిగ్గగుచు
న్నది.

చ॥ చదివితి వేమిసార్థకము సద్గుణముల్గలిగించు విద్య నీ
హృదయమునందుఁ బాపభయమింతయు లేనపు డెన్నియేసియున్

గుదిరిచి చెప్పఁజాలుదువు కోవిదు నింబలేఁ జాలుఁజాలు నీ
వదనముజూచిన న్నరకబాధజనించును సుమ్ము దుర్మతీ॥

భుజం — ఓరీ! ఆత్మస్తోత్రపారాయణా! కులకలంకా! యింతదనుక నీ వెన్నిమాటలాడిన శాంతభావముతో నిన్ను మందలించుచుంటిని. దానిని గుర్తెఱుఁగఁజాలక యేమేమో ప్రేలుచుంటివి. ఇదే తుదిగాఁ జెప్పుచున్నాఁడ నాలకింపుము.

తే॥ గీ॥ ఒక్క గుద్దుకు నెత్తురు గక్కునట్లు
ముక్కుమీదను గుద్దెద మూఢ నోరు
మూసికొనిపొమ్ము ప్రాణముల్ పోవకుండ
బతికియుండినఁ జాలును పరువదేల?

సోమ — అవునుఁడు త్తగొడ్డున కఱపులచే'' టను సామెతవిన్నదేకదా

తే॥ గీ॥ ఓమ్ముపర్యలుసేసి హారమ్ముగా ధ
రింతు మోరక! యేలసామంతమిఁకను
వంటయింల్సొచ్చు కుందేటిపగిదిరైతి
వేల బీరమ్ము నీరమ్ము పాలుసేతు॥

(ఇద్దఱు రాజభటులతో వణిక్పతి ప్రవేశించుచున్నాఁడు)

వణి — (కుమారునితో) నిర్భాగ్యుఁడా! నీకీవాగ్వ్యయమేలరా? అరుగో! న్యాయమునుపరిపాలించు దాతలు వచ్చియున్నారు. అంతయును వారే విచారించుకొందురు. నీవూరకుండుము. (వస్తువులను గొన్నిటిని భుజంగరావుమీద రహస్యముగాఁ బడవైచి భటులతో) అయ్యా! అంతయు మీరే చూచుచుంటిరిగదా! నాకుమారేఁ యంతఃపురమున నిద్రించుచుండఁగా గృహంబుసొచ్చి నగలను దొంగిలించి పైఁగా నాకుఱ్ఱవానితో నెట్లు పోట్లాడుచున్నాఁడో తమరే విచారింపుఁడు.

భటు — (భుజంగరావు చేయిఁబట్టుకొని) రక్షకభటస్థానమునకు రమ్ము (అనిలాగికొని పోవుచున్నారు.) (నిష్క్రమింతురు.)

సోమ — తండ్రీ! ఈభటులకేమయిన నాశపెట్టితివా?

వణి.—ఈ వ్యాజ్యమును మనపక్షము సేయించినచో నూటపదహారులు బహుమతి యిత్తునని వాగ్దత్తముచేసి సగమురూకలు ముందిచ్చితిని.

సోమ — అంతటికిని నొప్పుకొనిరా?

వణి — వారికింకను నాశయున్నది కాని కార్యాంతమున మఱియొకమాటకూడ చెప్పి సంతోషపెట్టెదనంటిని.

సోమ — వాగ్ధాటికల న్యాయవాదినేర్పఱచితిరా?

వణి — ఏర్పఱచితిని, మనభోజనానంతరము పోయి న్యాయవాదితో మాటలాడి రావలెను పోదమురమ్ము. (నిష్క్రమింతురు)

(బంధనాలయమునఁ బ్రథమద్వితీయరక్షకభటావృతుఁడై భుజంగరావు ప్రవేశించుచున్నాఁడు.)

భుజం — (జనాంతికముగా.)

సీ॥ పదిమందిహితులతోఁ బాటునుండెడినేను
    నేరస్థులను గూడినెగడవలసె
నుద్యోగమును జేసి యూరిపెద్దలతోడఁ
    దఱగునాకీవ్రాత దెచ్చెనజూఁడు
ప్రాసాదములమీఁదఁ బండుచుండెడినేను
    బంధనాలయమందుఁ గుందవలసె
మిష్టాన్నములదించు నెలమినుండెడినేను
    మితభోజనముచేత మెలఁగవలసె॥

తే॥ గీ॥ సకటకాలంబు విపరీతమైనయపుడు
    రాజుబంటును బంటులేరాజులౌట
కలుగుమనయత్నములచేతఁ గాదుబ్రహ్మ
    వ్రాలుదప్పించుకొనుట యెవ్వారివశము॥

కేవలము విధి ప్రేరితమని మాత్రమెట్లు నిశ్చయింపఁగలము విధి వ్రాలుకూడఁదొలి జన్మమునందొనరించిన కర్మము ననుసరించియుండును అట్లు కాకున్న యెడల.

సీ॥ ఏనేడయా కాంత యేకాంతమునన్నుఁ
దనసెజ్జఁజేర్పఁగా దలఁచుఁటెడ
తలఁచెఁబో యానాటఁ దనచెల్మికత్తెతో
సిగ్గదివెంటనేచెప్పుటెడ
చెప్పెఁబో చెలియుంచుఁ జెప్పినంతనెయామె
తనస్నేహితకునన్నుఁ దార్చుటెడ
తార్చెఁబో యంతమాత్రననేను నాసఖి
గృహమందుఁ జేరి రాగిల్లుటెడ॥
తే॥ గీ॥ రాగ మొందిననేమా యె రమణితోడ
నప్పుడప్పుడుకలియక యెప్పుడచటఁ
గాలమునుబుచ్చనేలనా కర్మవశము
చేతఁగాకున్న నీలాటి సేగియున్న॥

ఒక్కసారి నామనోహారిణి యిచ్చటికివచ్చి నాతోముచ్చటించెదనని యాపెచే ద్రవ్యసహాయమును బొందిన రాజభటునితో నాకు రాత్రికడఁ గబురంపియున్నదికదా! ఆపెతోమాటలాడిన నామనోవ్యథయంతయుఁ దీరుటయే కాక ముందీవ్యాజ్యమునుగూర్చి జరుపవలసినవిషయములుగూడఁ దెలియఁగలవు.

ఉ॥ ముద్దులగుమ్మతోననుఁగు ముచ్చటలాడినఁ దాపమారెడుఁ
సుద్దులువల్కఁగా నెవ్యథ నుంతయునుండక సౌఖ్యమబ్బెడుఁ
ముద్దుఁగొనంగఁ గష్టములుబోవును గౌఁగిటఁజేర్చిన మహా
పద్దశవీడిపోయెడిసె బాసికఁ జింతలనేలయియ్యెడఁ॥

(తిరిగిచూచి) గల్లుగల్లుమను నందెలచప్పుడు వినవచ్చుచున్నది తప్పక నాయారవపాత్రము వచ్చుచుండవలయు. (తొంగిచూచి) నిజమే ఆపెయే వచ్చుచున్నది.

సీతా—(ప్రవేశించి విచారముతో)

తే॥ గీ॥ భర్త్మమందిరమందు నాప్రక్కమీఁద
నన్నుమదనకేళినిఁదేల్చి యున్నభువిని

బంధనాలయమునఁ జూడవలసె నేడు
కటకటా! విధిదాటఁగాఁ గలరె జనులు॥

ఇచ్చటికివచ్చి ప్రాణేశున్నియవస్థను గన్నులార్పఁ జూచినవిస్మృట నంతకుముందున్న మనోధీరతపోయి విచారమగ్నమగుచున్నది. నన్ను నూర్చికదా యీసుకుమారున కిట్టికష్టము సంభవించినది. మించినదా నికేమిచేయఁగలము. నాయిష్టదేవతయగు నాహైమవతినిఁ బ్రార్థించెద నుగాక.

సీ॥ హేమదుర్గానాధు కామసుందరుదప్ప
బాఱఁదోలిననీఁకుఁ జీరలిత్తు
గిరిరాజతనయ నావరునికష్టముగట్టు
నెక్కించుమరా నీకు మ్రొక్కులిడుదు
కామారినాప్రాణకాంతు నాపత్యము
ద్రముఁదాటజేసిన రవికెలిత్తు
గౌరినాదయితునికిలతఁ దీర్చుమునీకుఁ
బొడికుంకుమను దెచ్చి పూజసేతు!
తే॥ గీ॥ అంబనాప్రాణకాంతకానికి నడరుబాపు
మఖిలఫలములు దెచ్చి నీకర్పణంబు
సేతునాకుసంతోషంబు సేయుమంబ
సకలగుణపుష్పరోలంబ శైలజాంబ॥

ప్రథ—ఓయి! కడచినరాత్రిమనకుఁ దెల్పినప్రకారము సీతమ్మగారు వచ్చియున్నారు మనముకొంచెమావలికిఁ బోవుదమురమ్మా.

ద్వితీ—అవునురా మనకు జాలడబ్బుకూడ నిచ్చియున్నది. అటులనేబోవుదము. (నిష్క్రమింతురు.)

సీతా—(భుజంగరావును సమీపించి విచారముతో.)

మలయమారుతరాగము–ఆటతాళము.

(సంభాషణము.)

అకటనీకీవికటమగుస్థితి। నమరఁ జేసెనుగమలగర్భుఁడు

వికలమగునీహృదయమందున వెరపుఁగాంచకుమెడలుగష్టము॥
భుజం—చెలియనీముఖచంద్రబింబము తొలఁగఁజేసెను నాదుకష్టము
లలితమగునీమాటలనువిన। గ్లాని లేశములేకపోయెను॥ చెలి॥
సీతా—నాథనీకొకన్యాయ్యవాదిని నమరగూర్చితిధనమునిచ్చితి
నాధనంబునుగొంచునాతఁడు నాకు వాగ్దానంబొసంగెను॥ నాథ॥
భుజం—ఏమివాగ్దానమును నాతండిచ్చెనో యది తెల్పవేసఖి
నామనోహరివ్యాజ్యవిషయ మదేమియగునని కబురుపంపెను। ఏ।
సీతా—కల్లతెఱఁగునుఁ బన్నియుండిన కారణంబున మనమగెల్తుము
ఎల్లిజరుగువిచారణంబునఁ దెల్లమౌనని చెప్పిపంపెను॥ క॥
భుజం—సాక్షు లెవ్వరటంచునడిగిన సకియయేమని తెలిపియుంటివి
కక్షిదారులపన్నుగడ వ్యక్తంబుగాదని నేనెఱుంగుదు॥ సా॥
సీతా—నేనొకర్తను జెలులొకిద్దఱు నిజము సెప్పుట కొప్పుకొంటిమి
కానితండ్రికి నెడముకాఁగల కాలమిప్పటి కరుగుదెంచెను॥ నే॥
భుజం—లోకనిందకుఁ బాత్రురాలవు కాకయుండుము నాదుకర్ణముఁ
నాకుఁదప్పదు గాననేనది న్యాయ్యవిధినను భవమునొందెద॥లో॥
సీతా—లోకనిందయుఁ బ్రాణహానియు లోనుగాఁగల వానినెన్నఁడు
సాకుఁగొనుచు మనోహరాంగునిఁ జాలకష్టముపాలుసేతునె॥లో॥
భుజం—స్నేహలక్షణమన్నదిదియె చెలియనేటికిఁ దెలిసికొంటిని
రాహుముక్తశశాంకవదన పరామృశించితివెంతయుహర్షము॥ స్నే॥
సీతా—(తిరిగిచూచి) నాయకా! ఎవ్వరో యొక రాజస్థానాధికారియై యిటువచ్చుచున్నట్లున్నది. నేనిచ్చటనుండుటంత యుచితము కాదు. నేను బోయివత్తునా?
భుజం—అవును నిజమే నీవికఁబొమ్ము వీలయినప్పుడెల్ల నీముఖదర్శన భాగ్యము నాపై వెదజల్లుచుండుము.
సీతా—చిత్తమట్లేయొనరింతును (నిష్క్రమించుచున్నది)
భుజం—(జనాంతికముగా)

ఉ॥ వచ్చినవాఁడువచ్చె నిఁకఁబంకజనేత్రను బోయకుండునా
కచ్ఛపలాక్షి యెంతయు సహాయము సేయుదునంచుఁ జెప్పెనే
నిచ్చటఁగుండ నేల యిదియెట్లును గల్పితనేరమాతుచేఁ
జెచ్చెరఁగొట్టివేయుదురు చేడెనుగూడెదఁ జింతవీడెదన్॥

భ్రాంతియేకాని భావికాలము నెవరునిర్ణయింపఁగలరు?

తే॥ గీ॥ ఎట్టికాలంబునకు నెద్ది యేవిధాన
జరుగవలెనో యది సతంబు జరుగుఁగాని
మనుజు లనుకొన్నయటు లేదియునునొకప్డు
డేనిఁగాఁజాల దవనినొ దేనిఁగాని॥

ప్రతీహారి—(ప్రవేశించి) భుజంగరావుగారు మీ వ్యాజ్య విచారణదినము నేఁడే. తమరిని "న్యాయస్థానమునకుఁ గొనిర"మ్మని ప్రభువుగారి యుత్తరువైనది (తాళముతీయుట నభినయించి యతనిని భటుఁడు వెంటఁగొనిపోవుచున్నాఁడు.) (నిష్క్రమింతురు)

—గద్య—

ఇతి శ్రీమత్కాశీనాథుని వీరమల్లయారాధ్య
విరచిత సీతామనోహరనాట
కంబునఁదృతీయాంకము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సీతామనోహరము.

## చతుర్థాంకము.

### న్యాయస్థానము.

(రాజును, డంబాచారి ఉత్తమరావను న్యాయవాదులు ప్రవేశించుచున్నారు.)

రాజు — సేవకా! వణిక్పతిని భుజంగరావును బిలువుము.

సేవ — చిత్తము. (మూడుసారులు పిలుచును.)

వణి — (ప్రవేశించి) దణ్ణములండి

రాజు — ప్రమాణము చేయించవోయ్.

సేవ — దేవుని యెదుట ప్రమాణముచేసి అంతయు నిజము చెప్పెదను. అబద్ధమేమియును జెప్పను. (అని వణిక్పతిచే ననిపించును.)

రాజు — నీపేరేమి?

వణి — అయ్యా వణిక్పతండి.

రాజు — నీతండ్రిపేరేమి?

వణి — పేరిసెట్టి.

రాజు — నీవ్యాజ్యమేమిటి?

వణి — అయ్యా! యీ శు ॥ బుధవారమునాడు రాత్రి 12 గంటల వేళ భుజంగరావు నాగృహములో దొంగతనమునకై ప్రవేశించి మేమందరమును గాఢముగా నిద్రించుచుండఁగా పూర్ణాభరణ భూషితమైన నాకుమార్తెయగు సీతారత్నము మెడలోని బంగరు కంటెయుఁ గాసులపేరు, సంగ్రహించుకొని పారిపోవుచుండఁగా మాకుఱ్ఱది మెలుకువగాంచి కేకలు పెట్టినది. అప్పుడు నాకుమారుఁ

డగు సోమయ్య నిద్రలోఁ ద్రుళ్లిపడిలేచి వానినిఁ బట్టుకొనెను. నేను రక్షకభటాలయమునకేగి యచ్చటి యధిపతితోఁ జెప్పితిని వారిద్దరుభటులను నావెంటబంపినపుడా భటులు నాగృహమందు నాకుమారునితో వివదించుచున్న భుజంగరావును బట్టుకొని యతనియొద్దనున్న నగలతోఁ దమవెంటఁ గొనిపోయి కొట్టులోనుంచిరి. న్యాయప్రభువులరగు తమరు విమర్శించి దోషియగు భుజంగరావు నుశిక్షించి నాసొత్తును నాకిప్పించఁగోరెదను.

ఉత్త—భుజంగరావు మీ యింటిలోఁ బ్రవేశించునప్పుడు చూచి యుంటివా?

వణి—లేదు.

ఉ—నగలను నీకుమార్తె మెడలోనుండి తీసుకొనుచుండఁగా నామె కాని నీవుకాని మఱియెవ్వరుకాని చూచి యుండిరా.

వణి—నేను చూడలేదు నాకుమార్తె చూచి కేకలుపెట్టినది.

రాజు—నీకుసాక్షులెవరు

వణి—సీతారత్నము, సోమయ్య, రంగిసెట్టి.

రాజు—సేవకా! సీతారత్నమును పిలువుము,

సేవ—(ముమ్మారు కేకలిడి సీతారత్నమును పిలిచి వెంట గొనివచ్చి ప్రమాణము చేయించును.)

రాజు—నీపేరేమి?

సీతా—సీతారత్నము

రాజు—నీభర్త పేరేమి?

సీతా—భుజం, రామస్వామి.

రాజు—భుజంరామస్వామియా?

సీతా—కాదు రామస్వామి.

రాజు—అటులనా? సరే మంచిది. నీవు భుజంగరావునెఱుగుదువా?

సీతా—ఎఱుగుదును.

రాజు—అతఁడు మీయింటికిఁ దొంగతనమునకై ప్రవేశించినాఁడా?

సీతా—లేదు.

రాజు—నీమెడనుండి నగలుతీసుకొనుచుండఁగాఁ గేకలుబెట్టితివా ?

సీతా—లేదు.

డంబా—నీవివాహసమయమందు నీకేమేమి నగలుపెట్టినారు ?

సీతా—కంఠి, కాసులు, వడ్డాణము, పోచీలు, కాళ్ళజతలు, చేతిజతలు, నిచ్చినారు. మఱికొంతరొక్కమిచ్చినారు.

డంబా—అవియన్నియు నిప్పుడు నీకడనున్నవా ?

సీతా—కంఠి, కాసులు, రొక్కము నాయొద్ద లేవు.

డంబా—ఏమయినవి ?

సీతా—రొక్కము నాకియ్యలేదు కంఠి, కాసులు మాతండ్రిగారుతీసుకున్నారు.

డంబా—ఎప్పుడు.

సీతా—వారముదినములయినది.

డంబా—భుజంగరావు దొంగతనము చేసినాడని చెప్పుటకు భయమగుచున్నదా ?

సీతా—భయమేయగుచున్నది.

డంబా—(కూర్చుండును)

రాజు—ఏమయ్యా ! ఉత్తమరావుగారు నేరస్థునిపక్షమున మీారేమైన నడుగుదురా ?

ఉత్త—చిత్తము. (సాక్షితో) మీానాయనగారు నీకంఠియు, గాసుల నెందుకుఁ దీసికొనిరి ?

సీతా—నాకుఁ దెలియదు.

ఉ—భుజంగరావు దొంగతనముచేయ వచ్చినాఁడనుటకు భయమగుచున్నదంటివే అదేల ?

సీతా—అనృతమగుటవలన

ఉ—నీవు రామస్వామిని వివాహమాడుట కంగీకరించితివా?

సీతా—లేదు.

ఉ—అట్టిచో వివాహమెట్లయినది?
సీతా—నాతండ్రిగారు బలవంతముగఁ చేసినారు.
ఉ—నీతల్లియు సోదరుఁడు నొప్పుకొనిరా?
సీతా—లేదు
ఉ—చాలునింకఁబొమ్ము
రాజు—సేవకా సోమయ్యనుపిలిచి ప్రమాణము సేయించుము
సేవ—చిత్తము (మునుమ్మారుపిలిచి సోమయ్యచేఁ బ్రమాణముసేయించును.)
రాజు—నీపేరేమి?
సోమ—సోమయ్య.
రాజు—నీతండ్రియెవరు ?
సోమ—వణిక్వ్రతి.
రాజు—నీవయస్సెంత ?
సోమ—25 ఏండ్లు.
రాజు—డంబాచారిగారు ! అడగండి?
డంబా—భుజంగరావు నెఱుఁగుదువా?
సోమ—ఎఱుగుదును
డంబా—నీతండ్రి యితనిపైఁదెచ్చిన వ్యాజ్యమునుగూర్చి నీకేమి తెలియును.
సోమ—ఇతఁడు ౫ బుధవారమునాడు రాత్రివేళ మాయింటిలోఁ జొరబడి నాచెలియలిమెడలోని కంతియుఁ గాసులపేరును దీసుకొని పోవుచుండఁగా నేనుపట్టుకొని మాతండ్రిని పిలిచితిని ఆయనరాజభటులను పిలుచుకొనివచ్చి వారికి భుజంగరావు నొప్పగించి యీ వ్యాజ్యము తెచ్చినాడు.
డంబా—(కూర్చుండును)
రాజు—ఉత్తమరావుగారు కానియ్యండి,
ఉ—నగలను నీచెల్లెలిమెడలోనుండి తీసికొనుచుండగా నీవుచూచితివా

సోమ—లేదు. తీసికొని పాఱిపోవుచుండగాఁ జూచితిని.
ఉ—నీకును భుజంగరాఘునకును విరోధమున్నదా?
సోమ—ఉన్నది.
ఉ—ఎందువలన?
సోమ—ఊరకయే.
ఉ—ఎవరెవరికి?
సోమ—నాకును నాతలిదండ్రులకును నతనియెడల విరోధమే.
ఉ—నీచెలియలిని రామస్వామికిచ్చుటకు నీవిష్టపడియుంటివా?
సోమ—లేదు.
ఉ—అతనినిఁ జేసికొనుటకామె యిష్టపడినదా?
సోమ—లేదు.
ఉ—చాలునిఁకబొమ్ము.
రాజు—సేవకా! రంగిసెట్టినిఁబిలిచి ప్రమాణముసేయింపుము
సేవ—చిత్తము. (అట్లుసేయును)
రాజు—నీపేరేమి?
రంగి—నాపేరు రంగిసెట్టి.
రాజు—నీతండ్రిపేరేమి?
రంగి—అబద్ధాలు.
రాజు—నీకెన్ని యేండ్లు.
రంగి—నలుబది సంవత్సరములు.
రాజు—డంబాచారిగారు! ప్రశ్నింపుఁడు.
డంబా—నేరస్థుని యెఱుఁగుదువా?
రంగి—ఎఱుగుదును.
డంబా—ఎంతకాలమునుండి యెఱుఁగుదువు?
రంగి—చిన్నప్పటినుండి ఎఱుగుదును.
డంబా—ఎట్లెఱుఁగుదువు.
రంగి—అయ్యో! ఒక్కూరివారమేకా.

డంబా—ఇతనిగుణ మెటువంటిది.

రంగి—వాఁడు మంచివాఁడేకాని చిన్నప్పటినుండి కూఁ బొంగరుమోతులును, పోకిరిసహవాసము కలఁవాడును.

డంబా-వారముదినములక్రిందట నితఁడేమిచేసినాఁడో నీకుతెలుసునా?

రంగి—మావణిక్పతిగారియింట్లో నగలెత్తుకొనిపోయినాడని అన్నారు. కాని నాకళ్ళతో నేనుచూడలేదు, పాపపుమాటల్కడ చెప్పదును.

డంబా—ఎత్తుకొనిపోయిన దెవరనియన్నారు?

రంగి—భుజంగరావనియే అన్నారు.

డంబా—(కూర్చుండును.)

ఉత్త—(లేచి) భుజంగరావని యెవరన్నారు?

రంగి—అందఱున్నారు.

ఉ—అందఱనఁగా నెవరు?

రంగి—వణిక్పతివారందఱు నన్నారు.

ఉ—వణిక్పతి యింటివి శేషముఁ లింకేమయినా నీకుఁ దెలుసునా?

రంగి—అ. అ. అ. అబ్బె రామా రామ. మనవంటివారను కోఁదగనివి యేందుకులెండి పాపము పుణ్యము భగవంతుఁడికి తెలియవలెను.

రాజు—నవ్వకూడదు తెలిసిన నిజమంతయుఁ జెప్పుము. లేకున్న నిన్ను శిక్షించెదను.

రంగి—(భయముతో) చిత్తము చిత్తము.

ఉ—తెలుసునా? తెలియదా?

రంగి—అంటారుకాని నాకు తెలియదు.

ఉ—ఏమనియంటారు?

రంగి—ఆపిల్లకు వీడికి సంబంధమున్నదని.

ఉ—చాలునుఁబొమ్ము (కూర్చుండును.)

డంబా—(లేచి) న్యాయాధిపా ! ఈదొంగతనము జరిగినసమయము నడురేయియయి యున్నది అట్టిపనికి సాక్ష్యము విరివిగా దొరకు

ట యసంభవము మూఁడవసాక్షియగు శంగిసెట్టి చెప్పినదానినిఁ బట్టియు నేరస్తుని ముఖవైఖరినిఁబట్టియు నితఁడీ దొంగతనమును చేసియుండెనన్నట కెంతమాత్రమును సందేహము కనుపించదు. రక్షకభటులు వణిక్పతియింటిలో భుజంగరావును బట్టుకొనినపుడు చౌర్యధన మతనియొద్దనే యున్నట్లు వారు తమ న్యాయస్థానమునకుఁ బంపిన కాగితమునుబట్టి స్పష్టముగా నమ్మదగియున్నది. ఇతఁడు మున్న నేకపర్యాయము లిట్టి వ్యాజ్యములలో న్యాయస్థానమున కెక్కి యున్నాఁడు. వీని దౌర్జన్యమునుబట్టి నిజముగా నెఱిఁగిన దానినిఁ గూడఁ బలకరను గారణముచేతఁ గొందఱుసాక్షులను మేము వదులుకొని యుంటిమి. రుజువు కాకపోయినను న్యాయాధిపతుల స్వాభిప్రాయమునుబట్టి న్యాయాధిపతులు నేరస్తులను శిక్షింపవచ్చునని శాస్త్ర మొప్పుచున్నది. వీని నిప్పుడు శిక్షింపక విడిచిన యెడల ననేకమంది జనులకుఁ గష్టములు సంభవించును. గావున జనసౌఖ్యార్థమై మర్యాదస్థుఁడగు వీనిని శిక్షింపవలయునని నేరాపాదకుఁడు తమయొక్క ఘనమును గూర్చి మిక్కిలి ప్రార్థించుచున్నాఁడు.

ఉత్త—(లేఁచి) న్యాయాధిపా! ఇది కేవలము కల్పిత వ్యాజ్యమైయున్నది. మొదటిసాక్షియొక్క వాఙ్మూలమునుబట్టి యీవిషయమును దేవరవారు విస్పష్టముగాఁ దెలిసికొని యుందురు. రెండవసాక్షి చెప్పినప్రకారము నేరాపాదకుని కుటుంబములోని వారందరికిని నేరస్థునియందు విరోధమున్నట్లు తెల్లమయినది. ఆ విరోధకారణ మతఁడు సిగ్గుచే జెప్పకపోయినను మూఁడవసాక్షి వాఙ్మూలముయొక్క చివరభాగమునుబట్టి విశదమగుచున్నది. అట్టి విరోధముచేత నీవ్యాజ్యమును గల్పించి యుండవలయునే కాని యిది యథార్థముగా జరిగియుండలేదు. రక్షకభటులచేఁ బంపఁబడినవిచారణాంశములను నమ్మఁగూడదని తగు హేతువులనుబట్టి దొరతనమువారు శాసించి యున్నారు. ఈ నేరము జరుగుచుండఁగా స్వయముగా

జూచినట్లొక సాక్షియుఁ జెప్పియుండలేదు. ఈనిష్ఫలమగు కల్లోలమునకు వణిక్పతియే కారకుఁడు. ఏమన-ఈడువచ్చియున్న తనకొమార్తెకననుకూల దాంపత్యము సంభవింపజేయుటయే. కాఁబట్టి న్యాయవిమర్శకులగు ప్రభువులు, నిర్దోషియగు భుజంగరావుపై వణిక్పతి విరోధ భావముతోఁ దెచ్చిన యీకల్పిత నేరమును దగ్గించి పరువునకు నష్టమును గలుఁగ జేసినందునకు వణిక్పతిని శిక్షించి యతనివలన భుజంగరావునకుఁ గొంతధనము నిప్పించవలయునని తమయొక్క ఘనతనుగూర్చి మిక్కిలి ప్రార్థించుచున్నాను.

రాజు—భుజంగరావు! నీపయిన గాఁబడిన యీవ్యాజ్యమునకు నీవేమిసమాధానమును జెప్పుకొనియెదవు?

భుజం—అయ్యా! యీచెప్పెడి నేరమును నేనెన్నడును చేసి యుండలేదు. నాకేమియును దెలియదు. ఇది కేవలము కల్పితము. కంఠియుఁ గానులును నాపైఁ బడవైచి రక్షకభటులను మంచిమాటఁ జేసికొని నన్నిట్లు వణిక్పతి యగౌరవము చేసినాడు. ఆసొత్తును వణిక్పతియే తీసుకొనినట్లు మొదటి సాక్ష్యమువలన రుజువు కాబడినది. నేను నిర్దోషిని. నన్నురక్షింపవలయును. యింతకంటె నేను జెప్పుకొనునదేమియును లేదు.

రాజు—ఈవ్యాజ్యములోని సాక్షులవలన నేరమెంతమాత్రమును రుజువుచేయబడి యుండలేదు. మొదటిసాక్షి భర్తపేరు చెప్పుటలోజరిగిన పొరబాటునుబట్టియు, రెండవసాక్షి నేరస్థునియందు దమకుటుంబములోఁ నందఱికిని నిష్కారణవైర మున్నదనుటను బట్టియు మూడవసాక్షి స్పష్టముగా నొప్పుకొనుటను బట్టియు వణిక్పతి కుమార్తెకును భుజంగరావునకు సంబంధ మున్నదని స్పష్టముగా నమ్మదగియున్నవి. ఆగుట్టును బయిటఁబెట్టుకొనినచో మర్యాద భంగమగుననియు తటస్థముగా నూరకొనుటకు మనసొప్పకయు

నీనేరమును గల్పించినట్లు నాకుస్పష్టముగాకన్పడుచున్నది. దొంగతనపునేరమందు భుజంగరావు నిర్దోషియని నమ్మితిమి. ఇకముందెన్నడును నీట్టికల్పిత నేరమును దేకుండుటకై వణిక్పతిని మందలించుచు వ్యాజ్యమునుఁ దగ్గించడమైనది.

(సభ్యులందఱు నిష్క్రమింతురు.)

గద్య.

ఇతి శ్రీమత్కాశీనాథుని వీరమల్లయారాధ్య
విరచిత సీతామనోహరనాట
కంబునఁచతుర్థాంకము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# సీతామనోహరము.

## పంచమాంకము.

(వణిక్పతియుఁ, గుమారుండును ప్రవేశించుచున్నారు)

సోమ—జనకా! రక్షకభటులకు సగముద్రవ్యము నిచ్చియుంటిమి. వారిందున మనకేమి సాయమును సేయలేదు. కావునఁ దక్కిన ధన మియ్యకుము.

వణి—అదికూడ నామరుసటి దినముననే తీసికొనినారు.

సోమ—మనమనుకొన్న కార్యము ఫలించకపోఁగా నిష్కారణము భటులు డబ్బు కాఁజేసినారే! దీనివలన మనకవమానము తప్పమ ఱేమియుఁ గలుగలేదు. మెదలక యూరకొనిన చక్కఁగానుండెడిది.

వణి—వారికిచ్చినది దండుగయే కాదు. ఏమన, వారికధికారమున్నంత వరకొక్క దినము కొట్టులో వేసినారుకదా? ఇఁక పరాభవమా? అదిస్వయముగాఁ దెచ్చుకొనినదే. ఆ చండాలపుముండ నెన్నఁడు సాక్ష్యమునకు దెచ్చితిమో నాడే యవమానము వచ్చినది. ఛీ! దాని మొగమును జూడరాదు. నేనింటికిరాను ఎచ్చటికేనిఁబోయెదను.

(నడుచుచున్నాఁడు)

సోమ—(పట్టుకొని) ఎక్కడికేగెదరు. ఇంటికిరండు మాయమ్మగారితో జెప్పిపోవచ్చును. (అనిలాగికొనిపోవును) (నిష్క్రమింతురు)

(వణిక్పతిగృహము.)

(వణిక్పతియు, గమలాంబయు, గుమారుఁడును ప్రవేశించుచున్నారు.)

కమ—నాథా! కావలయునని తెచ్చుకొనిన దానికిప్పుడు విచారపడిన నేమిలాభము. భూలోకమునఁ బుట్టినతరువాత సహజముగాఁ గలు

గుచుండెడు కష్టసుఖములు. ప్రతిష్ఠాప్రతిష్ఠలును మనుష్యజాతికిఁగా కింకెవరికి సంభవించగలవు. శుద్ధమూఖముహించి యా డపిల్లను న్యాయసభకు సాక్ష్యమునిమిత్త మీాడ్చుకొని పోయియుంటిరి. ఆకురప్రిని ర్భాగ్యురాలు, వ్యవహారములు తెలిసిన మగవారివలె నసత్యములుపలికి నిర్వహించుకొనఁగలదా? న్యాయాధిపతులను జూచినతోడనే దానికి యొడలు కంపమెత్తినదట. ఆ భయోత్పాతముచేత నిజము వెలుపలఁ బెట్టినది. మీా రావిషయమున కభిమానపడి కుమారిక బుద్ధిపూర్వకముగా మీకెగ్గుగావించినదని తలంచి "యింటనుండి లేచిపోయెద" ననుట మంచిది కాదు. ఎచ్చటికిఁ బోయెదరు ? ఊరకుండుడు.

వణి—ఎచ్చటికిఁ బోయెదనా? పెద్దయేటిలోనికి, చెప్పెదనువినుము.

సీ॥ కాశికాపురిఁ జేరి గంగానదీస్నాన
మునుజేసి విశ్వేశ్వరుని భజించి
రామేశ్వరముబోయి రామసేతుస్నాన
మునుజేసి రామలింగని భజించి
శ్రీపర్వతమునకుఁ జేరి పాతాళగం
గనుమున్గి మల్లికార్జును భజించి
వరకాళహస్తి సువర్ణముఖినిమున్గి
కాళహస్తీశునిఁ గనిభజించి
తే॥ గీ॥ ఎచ్చటేనియు వసియింతు నేమిఫలము
పరువువిడనాడినట్టి యీాబ్రతుకువలన
నిహముతేకున్న స్వర్గలోకైక సుఖము
గలుగుఁగావునఁ బోనిమ్ము కాంతనన్ను॥

కమ—సర్వమెఱిఁగినయట్టి మీకు మేము చెప్పెడిపాటివారము కాక పోయినను నామనవినిఁగూడ నించుకంత యాలకింపుడు. సంసారభారకర్తలగు మీారే యట్లు తలంచినచో మీతోడిదియే లోకమనియెంచుకొలవలసిన నేనుమాత్ర మిచ్చటనేలయుండవలయును.

నేనున్నువచ్చెదను. నన్నుఁగూడఁ గొనిపొండు. మీకొమరులీ సంసారభారమును వహింతురు.

సోమ.—ముక్కు పచ్చలారని కుబ్జపిశాచముపైనఁ గోపము వహించి యిట్టి యనార్యకార్యమును సేయదలంచుట మీ కుచితముగాదు. ఆకువిల్ల యనుసారనిన మనకుఁ జయమును కాదు. ఇతరు లెంత కఠినమునను కొన్నను తల్లిదండ్రులుమాత్రము గుటుక్కున దిగమ్రింగి తనపుత్రికామణినిఁ గడుపులోఁ బెట్టుకొనవలయును. లోకమునకెల్లమూఖుఁడయిన స్వకుక్షి పరాయణుఁడు దక్క తక్కొరులు మీవలె నిట్లు సేయరు.

ఉ॥ అల్లునిమీఁదఁ గోపమున నంగలుసాచును నచ్చటచ్చటన్
జెల్లని కోపతాపమున సిగ్గునుబోవిడి లేనిపోనివా
కల్లలుబల్కు మూర్ఖువలెఁ గాక మనంబున శాంతిఁ గాంచిమీ
పిల్లనుగడ్పలోననిడి ప్రేమనుజూపుట యుక్తమౌఁజూఁడీ॥

ఒకవేళ లోపమెయున్నచో.

తే॥ గీ॥ కుబ్జదానినిఁబిలిపించి కోపగించి
బుద్ధిసెప్పకమీరిట్లు పోదుమంచు
వెడలనేటికి నేఁబోయి పిలిచితెత్తుఁ
దప్పసైచుముకొమిరె పైదయవహించి॥

వణి—(తనలో) “కడుపుఁజించుకొనినఁ గాళ్లపయిఁబడు” నన్నట్లునా కడుపునఁ బుట్టినపిల్లను రట్టుసెట్టుట నాకు నిజముగనే ధర్మముకాదు. కావునఁబిలిపించి మందలించెదనుగాక. (ప్రకాశముగా.)

తే॥ గీ॥ కులఁపుమర్యాదనుంజెడఁ గొట్టినట్టి
మూర్ఖురాలినిఁగొనిరమ్ము పొమ్ముతగుచి
వాట్లఁబెట్టెదనిఁకబుద్ధి వచ్చునేమొ
యిదియుపినకున్న నిలువెడలెదనునేను॥

సోమ—చిత్తము అటులనే సేతును. (నిష్క్రమించుచున్నాఁడు.)

కమ—(భర్తతో) మీరనినట్లు దానియందు లోపమున్న మాటవా

స్తవమేయనుకొనుఁడు దానినిఁబయల్పఱచినలోపము మనకుఁగా
దా? పిల్లదానినిఁ భయపెట్టక నెమ్మదిగా మందలింపుఁడు.

వణి—పిచ్చిదానా! నాకుమాత్రము మనస్సులో లేదనుకొంటివా యే
మే? నెమ్మదిగానే మందలింతును లెమ్ము. ఊరక కళ్ళఁబళ్ళ బెదరిం
తునే కాని తిట్టుదుననుకొంటివా కొట్టుదుననుకొంటివా?

సీతా—(ప్రవేశించి) తండ్రీ నమస్కారము నాకేమి సెలవు?

వణి—(తనలో) కొంచెము కోపభావమును సూపవలయును. (ప్రకా
శముగా.)

ఉ॥ ఓసియభాగ్యురాల! చలమూనికులంబునఁ జేటుఁ దెచ్చితే
దోసఁపుఁగృత్యముల్ సలిపి దుందుడుకింత యొనర్చితౌర, మ
వ్వీసమునాదుతప్పునొక వీసమునీదగు తప్పితంబునున్
జేసియిటుల్ పరాభవము సేగిలభించెఁగతంబిఁకేటికిన్॥

తే॥ గీ॥ ఇంక నేనియుఁ దగురీతి నింటికడను
మంచివర్తనమునఁ జరియించితేని
మేలుకాక యథాస్థితి మెలఁగితేని
నిన్ను వెడలింతు నెందేని నేనుఁబోదు॥

సీతా—మీరంతగాఁ గినియుటకే నొనరించిన యకృత్యమేమియును లే
దు. నేనింటనుండుటయే కష్టముగాఁదోఁచినచో నెచటికేనిఁబోయి
వీలయినబ్రతికెదను. లేనిచో మడిసెదను. ఇంత భారము వహింపఁ
నేటికి?

వణి—పరువుగలయింటఁబుట్టి వ్యభిచరించుట సుకృతమా? న్యాయస
భయందు దండ్రినిఁ బరాభవించుట యుచితమా? రెంటిలో నేది
నీకుచితమని తోఁచినది.

సీతా—పతితోఁ గలియుట వ్యభిచారమును గాదు. నిజమును బల్కుట
నిను పరాభవించుటయును గాదు.

వణి—అగ్నిసాక్షిగ వివాహముఁ జేసికొన్న భర్తయుండఁగా నెవ్వఁడో
త్రాష్టుడు నీకుభర్తయగునా? ఆహా! ఎంతయవివేకముగానున్నది.

పంచమాంకము.

సీతా—అవును ఇందు విపరీతమేమున్నది. మనస్సాక్షిగ నేను వరించిన పురుషుఁడు నాకు భర్తయగును గాని నాకిష్టములేనిదే దారముగట్టిన మఱియొకండెట్లు కాఁగలఁడు.

వణి—అయిన నీవేమనియెదవు.

సీతా—ఇందేమియు దోసము లేదనియెదను.

వణి—ప్రప్రథమస్వీకృతుడుండగా మఱియొకనిఁగూడుట తప్పేలకాదు?

సీతా—చెప్పెదను వినుము,

సీ॥ తొల్తవిఘ్నేశు చేదోయిజిక్కనలచ్చి
వైకుంఠవాసుఁజేఁ బట్టెనెట్లు
అజపోతమును బెండ్లియైన గాంధారియా
ధృతరాష్ట్రుపాణిగ్రహించెనెట్లు
అర్కప్రసాదంబు నందినయాకుంతి
పాండురాజునుగూడి బరగెనెట్లు
మొదట స్వయంవరంబునఁ బార్థునకుఁదక్క
ద్రౌపది యేవురిఁ దగిలెనెట్లు॥
తే॥ గీ॥ వారలందఱునుం బతివ్రతలటంచు
మూడులోకంబులనుగీర్తిఁ బొందలేదె
తెలిసితెలియని యూహఁబుం శ్చలియటంచు
బలుకఁజెల్లునె నీయట్టివారలకట॥

చ॥ పడఁతికి మానసంబెవరి పైఁబ్రసరించునొ తొల్తనట్టి యా
తఁడు ధవుఁడౌనుగాక తలిదండ్రుల ప్రేరణచేతఁగన్యకున్
మెడకొకత్రాడుగట్టి బలిమిన్ గులకాంతయటన్నఁజెల్లునే
వెడఁగుఁదనంబుగాక న్యయవేదులకీగతి బుద్ధిపుట్టునే॥
తే॥గీ॥ నేవరించినవల భుజంగరావునాకు
భర్తయగుగానిఁ యాదేబెభర్తకాఁదు
హితమయేనియునన్నుంచు డింటలేద
యేనిపో యెదనింకెటకేని యేను॥ (సమ్మ)

వణి—(తనలో) చాలునీకేబుద్ధివచ్చినది. నాకుమాత్రమేకాక లోక
ములోని తల్లిదండ్రులందఱికిని మంచినడత నేర్పినది ఉదాహరణ
పూర్వకముగా జెప్పుచున్నప్పుడెవ్వరు కాదనఁగలరు ఇంతకునీయా
డుపాండ్రకు విద్యాబలము హెచ్చినకొలఁదిని నిట్టిమందమతుల్లు
పుట్టుచున్నవి (భార్యతోఁ ప్రకాశముగా)

చ॥ తెలివియొకింత లేక సుదతీమణి కిష్టము లేనివానిఁ బెం
డ్లి యొనరించినందుకుఁ గడిందివిచారము సంభవించె నెం
దులకిఁక లేసిపోనివని? తోయజనేత్ర! కుటుంబభారముం
దొలఁగి వనాంతరంబున ననూన తపంబొనరించుటొప్పగున్॥

కమ—అవును, మనకీ సంసారసంబంధము విడచుటయే యుచితమ్మని
నాకునుదోఁచెడిని

చ॥ వనమునకేగనేల యొకపంచను గూర్చుని రామ రామ యం
చనుకొని కాలముంగడపి యాకసిగందుల చేతిమీఁదుగాఁ
దనువుల దాటవేసి సుఖదంబగు నిర్జరలోక సౌఖ్యముల్
గనుటుచితంబు, నాథ! ననుఁగాదన కిష్టమొసంగఁ గాఁదగున్॥

వణి—అటులనే కానిమ్ము

మత్తకోకిల॥ భూతలంబునఁ దల్లిదండ్రులు పుత్రికాహితుఁడౌవరున్
జేతనావిధిఁ గూర్చుటొప్పను శ్రేయముల్ గనుబుద్ధితో
నీతలోదరి యట్టులేరును నెప్పుడుం గనకుండఁగన్
జాతకంబిడు గాతమీశుఁడు సత్కృపాహితవృత్తితోఁ॥
(అందఱు నిష్క్రమింతురు)

గద్య.

ఇతి శ్రీమత్కాశినాథుని వీరమల్లయారాధ్య
విరచిత సీతామనోహరప్రహస
నంబునఁ బంచమాంకము
సంపూర్ణము